Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

లంగరు దింపు

పంపినవారు :
టి. దైవాధీనం - నర్సింగి

రామయ్య: ఏవండీ శాస్త్రులుగారూ! ఇదేం విడ్డూరం - ఎండా, వానా లేకుండా అలా గొడుగు పట్టుకు వెళ్తున్నారేం?

శాస్త్రులు: అదా! ఇంగువలలో నకలు మార్కులు వర్షంలాగా కురుస్తున్నాయి - అవి పైన పడకుండా గొడుగు పట్టుకువెళ్తున్నాను.

రామయ్య:- అయితే అసలు మార్కు "యింగువ" ఏదీ?

శాస్త్రులు:- ఇంకా తెలీదా? అనేక ఏళ్లుగా ప్రసిద్ధికెక్కినది "ఎల్. జి." మార్కు ఇంగువే- ఇతర మార్కులనుచూసి మోసపోవద్దు! అదిగో చూడు, వారిచేతిలో; చక్కగా పరిశీలించి ఎల్. జి. (L. G.) మార్కు యింగువను బజారు నుండి కొని తీసుకెళ్తున్నారు. అదిగో అ అమ్మాయిని చూడు. ఎంతో అహ్లాదంతో ఆబిడ్డ






కూడా చేతిలో వుంచుకొని వెళ్తున్నది. అది గాక ప్రతి భారతీయ నారీమణి తన వంట కాలకు "ఎల్. జి." మార్కు యింగువను వాడుచున్నది.

ఎల్. జి. మార్కు యింగువతో తయారు చేసిన వంటకాలు ఘుమ ఘుమాయింపు తోను, రుచికరంగానూ వుంటాయి.

మీరు "ఇంగువ"ను కొనునపుడు ఎల్.జి. మార్కును, లాల్‌జి గోధు అండ్ కంపెనీ పేరును చక్కగా పరిశీలించి కొనుడు.

## లాల్‌జి గోధు అండు కంపెనీ

సౌకారుపేట :: మద్రాసు

హెడ్డాఫీసు — బొంబాయి.

# చందమామ

ంచాలకుడు:
'చక్రపాణి'

ప్రత్యేకించి పేరు పెట్టకపోయినా, ఈ సంచి
కను 'దీపావళి చందమామ' అనవచ్చు. దీనిలో
దీపావళి విశేషాలు ఎక్కువగా ఉండటమే ఇందుకు
కారణం. 'విజయ దీపావళి' గేయం బిడ్డల మన
స్తత్వాన్ని చక్కగా వెల్లడిస్తుంది. 'ప్రకృతిలో వెలుగు
లు' కని విని ఎరుగని వింతలను మనకు చూపుతై.
'పొట్టిపిల్లి' అనేది ముచ్చటైన మూడురంగుల కథ.
ఈ కథకు ముఖ్యుడైన బెన్నయ్య జీవితఘట్టాలు
పిన్నలకూ, పెద్దలకూ మార్గదర్శకాలే. ఆటబొమ్మకు
జీవం వచ్చేటంతవరకూ వాడు నిద్రపోలేదు. అటు
వంటి కార్యదీక్ష, ఉత్సాహమూ గలవారు విజయం
పొందుతారు. దీపావళి తరువాత నాగులచవితి. 'చెట్టు-
పుట్ట-పాము' ఛైపుచిత్రం ఇందుకు సంబంధించిందే.

సంపుటి : 13 : నవంబర్ 1953 : సంచిక : ౫







# విజయ దీపావళి

సీతా గీతా నేస్తాలు,
ప్రాణమీయగల నేస్తాలు.
ఒక కంచాన తింటారు
ఒక మంచాన ఉంటారు.
కిలకిల పండగ వచ్చింది
'కో' యని కోడి కూసింది.
లాల పోసుకొని ముస్తాబై
సీతను గీత పిలిచింది.
'ముత్యాలగొడుగును నే' నంది
ముసిముసి నవ్వులు నవ్వింది.
కలకలలాడే సీతమ్మ
దిగాలుమంటూ దీనంగా
'రత్నాలపాపను నే' నంది
రయమున మొగమటు తిప్పింది.
'సీతా, సీతా! పండగపూటా
ఏల విచారం? చెప్పవె మాటా!'
అని అడిగింది అంతట గీత.
అందుల కిట్లనె వంతతొ సీత :
'బంగరుపిచికవు నీకేం తల్లీ!
పండగ పబ్బం కాకేం తల్లీ!
చేతను పైసా లేకండా
తిండికి గింజలు లేకండా
పండగ మాకే ముం?' దంటూ
బావురుమని తెగ యేడ్చింది.

(గేయ కథ)

పాడుబ్రహ్మనూ తిట్టింది
'పక్షపాత మేలనె' అంది.
గీత అంత నిశ్చేష్టితురాలై
'పిల్లలందరము ఒకటే కాదా ?
మనలో మనకీ విభేదమేలా ?'



అని రివ్వున ఇంటికి వెళ్ళింది.
వెంటనె మరలుచు వచ్చింది,
పువ్వుల పావడ తెచ్చింది
చుక్కల జాకెట్ ఇచ్చింది.
'చెల్లీ, సీతా! రా' అంది.
'వీటిని కట్టుకొ చూదా' మంటూ
వీపున తన చెయి వేసింది.



కొత్తదుస్తులతో సీతమ్మ
తల్లి దీవెనలు పొందుటకై
ఇంటికి పోవగ, ఇల్లంతా
కలకలలాడుట చూచింది.
'ఇదిఅంతా ఆ గీతామహిమే!'
అనుకొని తల్లీకూతుళ్ళు
సంబరపడుతూ వుండంగా
బాణాసంచా వచ్చింది!
చూచారా, ఆ లేత మనస్సులు
చూచారా, ఆ తీయని గుండెలు,
ఉండా లలాంటి నేస్తాలు
ఉండా లుండా, లింటింటా!



# అట్టమీది బొమ్మ

దీపావళి అనగా దీపాల వరుస అని అందరకూ తెలుసు. ఈ మాట చెవిని పడ గానే ఒక పండగ పేరు మనకు స్ఫురిస్తుంది. అసలు, దీపావళి అనే ఈ మాట లోనే ఏదో గొప్ప విశేషమున్నట్టు తోస్తుంది.

ఐతే—దీపావళి పేరులోనే గాక, పండగలోకూడా గొప్ప విశేషమున్నది. దీపావళి పేరు వింటే మనస్సు వికసిస్తుంది. దీపావళిపండగ వస్తే ఆశాజ్యోతులు వెలిగి ప్రకాశిస్తాయి. దీపావళి పేరు అంత శ్రావ్యంగా వుంటుంది. దీపావళి పండగ అటువంటి కళ్ళవెలుగును ఇస్తుంది.

దీపావళిపండగ రాత్రిపండగ. చిమ్మచీకటిలో అది వికసిస్తుంది. ఇంటి లోనూ, మనసులోనూ వుండే అంధకారాన్ని పటాపంచలు చేయటానికి ఈనాడు దేశమంతటా కోటానకోట్లు దీపాలు వెలుగుతై. తల్లులు చేసే దీపారాధనలతో, పిల్లలు చేసే బాణాసంచాల శబ్దాలతో, దీపావళిపండగ దివ్యంగా శోభాయమా నంగా జరుగుతుంది.

ఏటా ఇంత శోభతో జరిగే ఈ పండగ ఎందుకోసం? నరకాసురుడనే రాక్ష సుడు యీనాడు తుదముట్టింపబడ్డాడు! ఇప్పటికి మనదేశంలో ఎంతమంది రాక్షసులు పుట్టలేదు? చావలేదు? అందరి చావుకోసమూ ఇటువంటి వైభవమైన ఉత్సవాలు జరుగుతున్నవా?—లేదు. మన భారతజాతికి ఇటువంటి దీపాల ఉత్సవాన్ని కల్పించిన ఆ నరకాసురుడు ఎంత క్రూరుడోకదా!

నిజానికి, మనదేశంలో పుట్టిన దేవతలూ గొప్పవాళ్ళే, రాక్షసులూ గొప్ప వాళ్ళే. అందుచేతనే, మనదేశపు కథలు ప్రపంచమంతటినీ ఆకర్షించినై. లోకానికంతటికీ దారిచూపుతున్నాయి.

మన దీపావళి, లోకంలో ధనవంతులకూ దరిద్రులకూ ఒకే విధంగా వెలుగు చూపుతుంది. పండగలలోకల్లా ఈ పండగ అంటే పిల్లలకు యెంతో ఇష్టం. తల్లులకు ఎంతో తుష్టి. ఇంటా బయటా కలకలలాడే ఈ దీపావళి తల్లుల పండగ, పిల్లలపండగ. ఇంటింట జరిగే పండగ, ఇంటిల్లిపాదీ పాల్గొనే పండగ.

ఈవిధంగా ఒక యింటి తల్లీ పిల్లలు ఉత్సాహంతో పాల్గొంటూవున్న దీపా వళి దృశ్యమే, ఈ నెల చందమామపైన మీరు చూచే అట్టమీది బొమ్మ.

# రఘువంశం




దిలీపమహారాజు పట్టమహిషి పేరు సుదక్షిణాదేవి. ఆ దంపతులకు సకల సంపదలూ ఉన్నాయి కాని సంతానం లేదు. అందువల్ల ఆయన భార్యాసమేతుడై గురువైన వశిష్ఠమహామునివద్దకు పోయి, తనకు వంశం నిలబడే యోగ్యత ఉన్నదో లేదో చెప్పమని కోరాడు.

వశిష్ఠమహామునివద్ద నందినీధేనువనే గోవు ఒకటి ఉంది. "ఈ గోవు సామాన్యమైనదికాదు. కామధేనువుయొక్క పుత్రిక. నీవూ, నీ భార్యా కలిసి ఈ గోవును కొన్నాళ్లు భక్తిశ్రద్ధలతో సేవించినట్టయితే, మీ కోరిక తీరుతుంది' అని దిలీపునికి సలహా చెప్పాడు వశిష్ఠమహర్షి.

రాజూ, రాణీ రోజూ ఉదయమే లేచి స్నానం చేసుకొని తరువాత ఆ గోవును పువ్వులతో పూజించేవారు. దూడ పాలుతాగి విడిచినపిమ్మట రాజు ధేనువును అడవులమ్మట మేతకు తోలుకువెళ్ళేవాడు. నీడకు మల్లే వెనకాలేఉండి, దానికి ఏ అపాయమూ రాకుండా కంటికి రెప్పలాగ కాపాడేవాడు. సాయంకాలంవరకూ మేపి ఇంటికి తోలుకు వచ్చేవాడు. ఇలా ఆ భూపాలుడు గోపాలుడై ఇరవైయొక్క రోజులు గడిపాడు.

ఇరవైరెండోరోజున యథాప్రకారం రాజు నందినీధేనువును తోలుకువెళ్ళాడు. అది ఆనాడు హిమవత్పర్వతాలవైపు దారితీసింది. ఆ పర్వతాల ఎత్తూ, గాంభీర్యం, అందమూ చూస్తూ, క్షణకాలం రాజు ధేనువును మరిచాడు. అలోగా అది ఒక గుహలోపల ప్రవేశించింది.

వెంటనే ఏదో ఆపదలో చిక్కుకొన్న దానికిమల్లే అది 'అంబా' అని అరిచింది. ఈ ఆర్తనాదం వినటంతో రాజు ఉలిక్కిపడి

పాలంకి వెంకటరామచంద్రమూర్తి



గోవును వెతుకుతూ పరుగెత్తిపోయి ఆ గుహను ప్రవేశించేసరికి, గోవుపైన ఒక సింహం ఎక్కికూర్చుని దానిని భక్షించ టానికి సిద్ధంగా ఉన్నట్టు కనపడింది. వెంటనే రాజు అమ్ములపొదిలో చెయ్యిపెట్టి బాణం తీయబోయాడు.

ఏమి చిత్రమోకాని ఆ చెయ్యి స్తంభించి పోయి, అతడు బాణం తీయనేలేక పోయాడు. ఆశ్చర్యంతో, కోపంతో నిలబడి వున్న రాజుతో ఆ సింహం మానవభాషలో మాట్లాడజొచ్చింది :

'లాభంలేదు. ఒకవేళ నువ్వు నామీద బాణం వేయగలిగినా అది నన్నేమీ చెయ్య లేదు. ఏమంటే నేను శివునికి పరమాప్తుడైన కుంభోదరుణ్ణి! అయన ఎద్దునెక్కేటప్పుడు నా వీపుమీద అడుగుపెట్టి మరీ ఎక్కుతాడు. ఆయనే నన్ను సింహంగా మార్చి ఇక్కడ కాపలా పెట్టాడు. ఇక్కడకు వచ్చిన ఏజంతువునైనాసరే పట్టుకు తినే హక్కుకూడా నాకు ఆయనే ఇచ్చాడు.

'అటుచూడు, ఆ దేవదారుమొక్కను. దాన్ని పార్వతీదేవి సరదాగా పెంచింది. ఒకనాడు అడవిఏనుగ ఒకటి ఆ చెట్టును పెట్టి ఒళ్లు రాసుకుంది. దానితో అంతమేరా చెట్టుయొక్క బెరడు ఊడి చక్కాపోయింది. అప్పుడు పార్వతీదేవి చాలా విచారించింది. అందుకోసమే పరమేశ్వరుడు ఆ చెట్టు పాడుకాకుండా నన్నిక్కడ ఈ రూపంలో కాపలా పెట్టాడు. ఇదీకథ. నువ్వింక చేయ గలిగిన దేమీ లేదు. ఈ గోవు ఆయువు నేటితో మూడింది. దీన్ని భక్షించి నా ఆకలి తీర్చుకుంటాను. కనుక నీదారిని నువ్వు వెళ్లవచ్చు' అని చెప్పింది.

ఐతే, దిలీపమహారాజు కదలలేదు. 'శివుని ప్రభావంవల్లనే నాహస్తం స్తంభించి పోయిందన్నమాట! అందువల్ల ఈ గోవును నేను నా బాణాలవల్ల కాపాడలేను. కాని దీనికి బదులుగా నేనే నీకు ఆహారమౌతాను.

దీనిని వదిలెయ్యి. పాపం, దీని దూడ ఆకలితో పాలకోసం నకనకలాడుతూ వుంటుంది. ఆ లేగమీదనైనా దయదలచి ఈ గోవును వదిలెయ్యి. మా గురువైన వశిష్ఠ మహామునికి ఇది లేకపోతే ఆయన చాలా ఇబ్బంది పడిపోతాడు' అన్నాడు.

ఈ మాటలు విన్న సింహం వికటంగా నవ్వుతూ, 'చూడగా మూర్ఖునికిమల్లే ఉన్నావే? ఈ ఆవు లేకపోతే నీ గురువు ఇబ్బందిపడతాడని తోస్తే దీనికి బదులు ఆయనకు కోటానుకోట్ల గోవులను ఇయ్యగల సమర్థత ఉంది నీకు. అలాంటిది ఒక్క ఆవుకోసం, మహీమండలానికి ఏకఛత్రాధిపతివైన నీవు, ప్రాణం వదిలేస్తానంటావేమిటి? నువ్వు పోతే ఒక్క ఆవు ప్రాణమే నిలుస్తుంది. నువ్వు బ్రతికి ఉంటే, కోట్లకొలది జనుల ప్రాణాలను కన్నతండ్రిలాగా కాపాడగలవు. ఈ మాత్రం తోచిందికాదే నీకు?' అన్నది.

ఆ మాటలు విని నందినీధేనువు జాలిగా చూడటం మొదలుపెట్టింది. అప్పుడు రాజు సింహంతో, 'నేను మహీమండలానికంతకీ చక్రవర్తినని పొగిడావు. ఆపదలో ఉన్న ఈ ఆవునే రక్షించలేని నా చక్రవర్తిత్వమెందుకు? నువ్వీ దేవదారువృక్షాన్ని ఎలా




కాపాడుతున్నావో, ఈ ఆవుని నేనలాగ కాపాడుతున్నాను. దీనిని వదిలి వెళ్ళటం న్యాయమా?' అన్నాడు. పైగా—

'ఒక ఆవుకోసమని నా మేను త్యజించ కూడదన్నావు. కాని, ఇది అన్ని ఆవుల వంటిదీ కాదుసుమా. కామధేనుపుత్రిక. కనుక, నా శరీరం బలిగొని నా కీర్తిశరీరం నిలబెట్టు. నా శరీరానికేం? నీ ఆకలి తీర్చటంకన్న నాకది ఎక్కువకాదు. నా మాట విను' అంటూ అనేకవిధాల ప్రాధేయపడ్డాడు దిలీపుడు.

'అలాగైతే సరే' అంటూ సింహం నందినీ ధేనువుమీదనుంచి క్రిందికి దుమికింది.

వెంటనే రాజు చెయ్యి స్వాధీనమైంది. అది తప్పని దిలీపుడు సింహంనోట పడడానికని వెళ్ళి దానిముందు కూర్చొని భగవంతుని స్మరిస్తూ కన్నులు మూసుకొన్నాడు.

సింహం తనమీద పడుతుందని కని పెట్టుకొనివున్న రాజు మీద తలవనితలంపుగా దేవలోకంనుండి పూలవాన కురిసింది.

భయంకరమైన సింహం ఆయనమీద పడలేదు సరికదా, 'కుమారా, లే' అన్న చల్లటి పలుకులు వినపడినై. రాజు కళ్ళుతెరిచేసరికి అక్కడ సింహం లేదు. 'ఏమైంది? నన్ను పిలిచిన దెవరు?' అని రాజు విస్మయంతో అడిగేసరికి నందినీ ధేనువు, 'ఎవరు!–నేనే. నిన్ను పరీక్షించటం కోసం ఈ చిత్రకథ అంతా కల్పించాను. సింహమూ లేదు, దేవదారువృక్షమూ లేదు. అంతా కల్పితమే. కుంభోదరుడు కాదు గదా, ఎవ్వరూ నన్నేమీ చెయ్యలేరు... నీ ధర్మబుద్ధికి మెచ్చుకున్నాను. నీకేమి వరం కావాలో కోరుకో రాజా' అన్నది నందినీధేను.

రాజు వినయంగా 'తల్లీ, వంశం నిలబెట్టే కుమారుడు కావాలి అని' కోరాడు.

ఐతే, తన పొదుగులో పాలు ఒక దొప్పెడు తీసుకు తాగమంది ధేనువు. లేగ దూడ తాగినతరువాత మిగత పాలు వశిష్ఠ మహామునికి ఇచ్చి, వారి అనుమతితో తీసుకుంటానన్నాడు రాజు.

ఈ మాటలకు మెచ్చుకుని ధేనువు ఆశ్రమానికి తిరిగివచ్చింది. జరిగిన సంగతులు విని సుదక్షిణాదేవి ఆనందపడింది. రాజు ధేనువు పాలు తాగి భార్యాసమేతుడై తన అయోధ్యానగరానికి తిరిగి వచ్చాడు. ఆ దంపతులకు చక్కని పుత్రుడు కలిగాడు.

ఆ బాలుడే రఘువు. రఘువు పెద్దవాడై గద్దె ఎక్కినతరువాత గొప్ప రాజనిపించు కున్నాడు. గొప్పరాజు కనుకనే ఆ వంశానికి అతనిపేరుతో, 'రఘువంశం' అనేది ఏర్పడి, ప్రసిద్ధికెక్కింది.






[కరుణను బలవంతంగా వివాహం ఆడదలచిన కబంధవర్మ, చండిదాసు అనుచరుల బాణాలకు బలిఅవుతాడు; సోమశర్మ గాయపడతాడు. సన్యాసివేషాల్లో వున్న విజయవర్మా, పానయ్యల్ని భీమవర్మ గుర్తించి వురిశిక్ష విధిస్తాడు. కాని, శిక్ష అమలుజరిపే సమయానికి దేవపూర్ జమీందారు అక్కడికి వచ్చి; హంతకులను విచారించే హక్కు తనదే-అని భీమవర్మతో వాదించి, వారిద్దరినీ తన భవనానికి తీసుకుపోతాడు. అటుతరువాత—]

మొదటినుంచీ దేవపూర్ జమీందారు కోసల్పూరుపక్షమువాడే. ఏ పక్షం అనుకూలంగా వుంటే ఆ పక్షంతో చేతులుకలిపే భీమవర్మ అంటే అతడికి మంట. కోసల్పూరు రాజపక్షంవారు బలవంతులు కనుకనూ, వాళ్లని ఓడించాలంటే ఎవరు ఎంతటి సాయంచేసినా—తమకు ఉపయోగమే కనుకనూ, కోసల్పూరువాళ్ళు భీమవర్మను ఉపయోగించుకొంటున్నారు. భీమవర్మ నిలువెల్లా దగాకోరేననే సంగతి ఎరిగివున్నాడు దేవపూర్ జమీందారు. సమయం చిక్కింది కనుక అతడి బద్ధవిరోధులైన విజయవర్మ ముఖాద్వారా అతడి రహస్యాలు కనుక్కోవాలనుకున్నాడు. ఆ అవకాశం యీనాడు లభ్యమైంది.

న్యాయస్థానంగా ఏర్పడివున్న మందిరంలో దేవపూర్ జమీందారు ఆసీనుడైనాడు. విజయవర్మనూ, పానయ్యనూ సైనికులు ఆయన ఎదటికి తీసుకవచ్చారు. 'చిక్కాము. ఆ దేవదేవుడు తప్ప మనలను




నమ్మివుంటాడని తలచిన వారికి, ఈ ప్రశ్న ఆశ, ఆశ్చర్యంకూడా కలిగించింది. అయినా, నిజం చెప్పకతప్పదు. అబద్ధం చెప్పి నమ్మించేందుకు ఆవగింజంతకూడా అవకాశంలేదు. తమని కోసల్వారు పక్షీయులు పట్టి బంధించడంతో, తాము బీసల్వారుపక్షీయులని తేలిపోతూనేవుందికదా!

దేవపూర్ జమీందారు ప్రశ్నకు విజయవర్మ యిలా జవాబిచ్చాడు :

"నేను బీసల్వారు పక్షంవాణ్ణే. ఇతడు మాత్రం ఏపక్షానికి చెందడు. ఒకానొక సందర్భంలో నాతో స్నేహం కలిసి, అప్పటి నుంచీ నాకు అండగా వుంటున్నాడు. ఇతడి పేరు పానయ్య! పడవలు నడిపే వృత్తి."

కల్లా కపటం లేకుండా విజయవర్మ ఇచ్చిన యీ జవాబుతో దేవపూర్ జమీందారు సంతృప్తిచెందినట్టు కనిపించాడు. అతడి ముఖాన చిరునవ్వు కదిలింది.

"నువ్వు అభయవర్మకు తగిన పుత్రుడవనిపించావోయ్ విజయవర్మా!" అన్నాడు. "మీ తండ్రిని నేనెరుగుదును. కాల పరిస్థితులకు అనుగుణంగా మనం కదలకపోతే ఎంత ప్రమాదకరమో, మీ తండ్రి జీవితమే మనకు నేర్పుతుంది. మీ తండ్రి చిత్రహింసలకు గురిఅయి మరణించాడనేది

ఎవరూ రక్షించలేరు' అని వాళ్లిద్దరూ భావించసాగారు. రణరంగంలో వీరమరణం పొందవలసిన తనకు—ఈ ఊరూపేరూ లేని చావు సంప్రాప్తమవుతున్నదే అని విజయవర్మ దిగులుపడసాగాడు.

దేవపూర్ జమీందారు పానయ్యా, విజయవర్మలవైపు సాలోచనగా చూసి ఇలా అడిగాడు—

"నిజంచెప్పండి! మీరు ఏపక్షంవాళ్లు ?"

ఇంతటి సూటిప్రశ్న వస్తుందని పానయ్యా, విజయవర్మా భావించిఉండలేదు. తమని బీసల్వారువాళ్ళనుగా భీమవర్మ చెప్పినసంగతి, దేవపూర్ జమీందారు

దేశంలో అంతా ఎరిగిన విషయమే. నేను కోసల్పూరువాణ్ణి. అయినా నిన్ను క్షమించి వదులుతున్నాను."

"మరి పానయ్య సంగతి?" అన్నాడు విజయవర్మ, జమీందారు అన్న వాక్యంలోని అర్థాన్ని గ్రహించి.

"వదలవలిసిన పనిలేదు. వాణ్ణిగురించి చాలాకాలంగా నేను వింటున్నాను. ఈ ప్రాంతంలో అంత పేరుమోగిన దగాకోరు మరొకడు ఉండడు. గొంతుకు వుచ్చుతగిలిస్తే కాస్త బాధపడినా, వాడికీ ఇతరులకీ తరవాత ఎంతో హాయి!" అన్నాడు జమీందారు.

జమీందారు మాటలు వింటూంటే, పానయ్యకు నిజంగానే గొంతుకు వుచ్చు బిగిస్తున్నట్టు తోచింది. దీనంగా విజయవర్మకేసి చూశాడు. విజయవర్మ గట్టి నిశ్చయానికి వచ్చినవాడిలా తల పంకించి దేవపూర్ జమీందారుకేసి తిరిగి ఇలా అన్నాడు:

"మీ దయకు పాత్రుణ్ణయినందుకు నేనెంతో గర్విస్తున్నాను. నిజం చెప్పాలంటే నాకు కోసల్పూరు—బీసల్పూరు రాజవంశీకుల తగాదాలతో ఏమాత్రం ప్రసక్తి లేదు. భీమవర్మ, సోమవర్మలు నా తండ్రికీ నాకూ చేసిన అన్యాయాలకు బదులుగా పగతీర్చుకోవడమే నా వుద్దేశం. కనుక నన్ను




క్షమించదలిస్తే, నా స్నేహితుడైన ఈ పానయ్యనూ క్షమించమని కోరిక."

విజయవర్మ గంభీరస్వరంతో ఇలా అనే సరికి, దేవపూర్ జమీందారు ముఖంలో క్షణకాలం కలవరపాటు కనబడింది. ఒక్కమారు దీర్ఘంగా నిట్టూర్చి—

"సరే, మీ ఇద్దరినీ వదిలిపెడుతున్నాను. మీరుమాత్రం ఇటుపైన నా కంటికిగాని, నా సైనికుల కంటికిగాని ఈ పరిసరాలలో కనబడకూడదుసుమా. పొండి!" అన్నాడు.

విజయవర్మా, పానయ్యా జమీందారుకు నమస్కరించి స్వేచ్ఛగా బయటికి వచ్చేశారు. ఇక ఆ ప్రాంతాన్నుంచి ఎంతత్వరగా



బయటపడి, తమతమ నివాసాలు చేరితే అంత శ్రేయస్కరమని వాళ్ళకు తెలియనే తెలిసింది. అందులోనూ భీమవర్మ సైనికుల బారి పడకుండా తప్పించుకుపోవడం ముఖ్యం.

వాళ్ళిద్దరూ అడ్డదారుల వెంట నడిచి అడవి చేరుకొనేసరికి సూర్యాస్తమయం కావచ్చింది. విజయవర్మా, పానయ్యా ఆకలితో నకనకలాడిపోతున్నారు. ముందు భోజనం, తరవాత విశ్రాంతి తప్ప చేయగల పనికూడా వాళ్లకు తోచలేదు.

"నేను నా రహస్యగృహానికి వెళుతున్నాను. నువ్వు సత్రం చేరుకొంటావా?" అని అడిగాడు పానయ్య, విజయవర్మను.

"అదే ఆలోచిస్తున్నాను. మనం తలపెట్టిన కార్యం పూర్తి కాకపోయినా, కొంతవరకైనా ఫలించింది. కరుణను రక్షించి వెంట తీసుకు రాలేకపోయినా, ఆ బలవంత పెళ్ళినుంచి రక్షించగలిగాం. ముందు కర్తవ్యం రేపు ఆలోచించవలసిందే. నేను సత్రానికి వెళతాను" అన్నాడు విజయవర్మ.

పానయ్య అడవిలోని తన రహస్య గృహంవైపు నడిచాడు. విజయవర్మ సరాసరి సత్రంకేసి నడవసాగాడు. కాని, అతడు సత్రం సమీపించకముందే, అతడిని వెతుకుకొంటూ ఇద్దరు అనుచరులు రావడం కంటబడింది. విజయవర్మ ఏదో ప్రమాదం సంభవించిందనుకుంటూ వారికి త్వరత్వరగా ఎదురువెళ్ళాడు.

అనుచరులిద్దరూ విజయవర్మను సమీపించారు. ఎంతో వుత్సాహంగా వున్న వాళ్ళ ముఖకవళికలను చూసేసరికి, విజయవర్మకు వాళ్ళు ఏదో శుభవార్త తెస్తున్నారనిపించింది.

"ఏమిటీ విశేషాలు?" అన్నాడు విజయవర్మ ఎంతో ఆత్రంగా.

"చాలా వున్నాయ్. సత్రం చేరగానే అన్నీ చెబుతాం. ముందు యీ వుత్తరం

చూడండి!" అంటూ అనుచరులలో ఒకడు ఒక వుత్తరం విజయవర్మకు యిచ్చాడు.

విజయవర్మ వుత్తరం ఒకటిరెండు మార్లు చదువుకున్నాడు. చంద్రదుర్గాధిపతి, బీసల్వారు రాజునుంచి పిలుపు రాగా తన అనుచరులతో బయలుదేరి వెళ్ళిపోయాడు. అక్కడికి ఇరవైమైళ్ళదూరంలో బీసల్వారు —కోసల్వారు సేనలమధ్య పెద్దయుద్ధం సాగే సూచనలు వున్నట్టు తెలిసి, అతడి కా పిలుపు వచ్చింది. విజయవర్మను జాగ్రత్తగా మసులుకోవలిసిందనీ, అనుచరులతో కలిసి ఏ నిమిషానికైనాసరే యుద్ధానికి బయలు దేరేటందుకు తయారుకావలసిందనీ హెచ్చరిస్తూ వ్రాసిన ఉత్తరం అది.

ఆ ఉత్తరం విజయవర్మకు అపరిమితానందం కలిగించింది. ఎట్టకేలకు కోసల్వారు రాజ్యప్రాంతం రణరంగం కాబోతున్నందుకు అతడికి చాలా సంతోషం కలిగించింది. ఈ దెబ్బతో భీమవర్మ దర్పం ఏమిటో తెలిసిపోతుందనీ, అసలు అతడు విడిదిచేసివున్న నర్మదానదీతీరపు భవనమే కదనరంగం కాగలదనీ విజయవర్మ భావించాడు.

అనుచరులతో కలిసి విజయవర్మ సత్రం చేరాడు. అక్కడ పరిస్థితి అంతా కోలాహలంగా వుంది. వేగుచూడబోయిన కొందరు రకరకాల వార్తలు పట్టుకువచ్చారు. వందలూ వేల సంఖ్యలో ఏవో సైన్యాలు అడవిదారులవెంట కదలివస్తున్నట్టు వారు చెప్పసాగారు.




"ఈ అడవిలో చెట్లకంటె అందులో తిరుగులాడే సైనికుల సంఖ్య అపారం. నా కళ్లతో నేను చూశా" నన్నాడు ఒకడు.

అనుచరులు చెప్పే ఈ వార్తలు వింటూ విజయవర్మ, భోజనం ముగించాడు. అప్పటికి రాత్రి చాలా పొద్దుపోయింది. అనుచరులలో కొందరు నిదురిస్తూవుండగా, మరి కొందరు వంతులుప్రకారం ఆ చుట్టుపట్ల




కావలికాయడానికి నియమించి తనూ నిద్రించాడు.

తెలతెల్లవారుతూండగా విజయవర్మకు మెలకువ వచ్చింది. సైనికదుస్తులు ధరించి, స్వయంగా ఆ చుట్టుపట్ల పరిస్థితులు ఎలావున్నదీ చూచి వచ్చేటందుకు బయలుదేరాడు.

అడవిప్రాంతం యింకా మసకచీకటిగానే వుంది. జాగ్రత్తగా దారిచూసుకుంటూ విజయవర్మ ఆ చెట్లమధ్య నడవసాగాడు. అలా కొంతదూరం నడిచేసరికి హఠాత్తుగా అతడి చెవులకు దగ్గరలోనే పెద్ద ధ్వని వినబడింది. ఆ క్షణంలోనే విజయవర్మ



ఒరనుంచి కత్తి లాగి ఆ ధ్వని వచ్చినవైపు పరుగెత్తసాగాడు.

గుబురుచెట్లు దాటుకొని ఒక ఖాళీ మిట్ట ప్రదేశందగ్గరకు వచ్చేసరికి— విజయవర్మ నిశ్చేష్టితుడయ్యాడు.

ఒకేఒక వ్యక్తిని ఐదారుగురు సైనికులు చుట్టుముట్టారు. కత్తులతో నరకబోతున్నారు. చుట్టుముట్టబడిన ఆ వ్యక్తి సైనికుల కత్తి దెబ్బలను కాచుకుంటూ, అవకాశం దొరికినప్పుడల్లా వారిని గాయపరుస్తున్నాడు.

"వస్తున్నా. భయపడకు. నిలబడు. ధైర్యంగా నిలబడు!" అని కేకలువేస్తూ విజయవర్మ ఆ యోధులకేసి పరుగెత్తసాగాడు. అలా యుద్ధానికి తలపడినవాళ్ళెవరో అతడికి తెలీదు. కాని ఒకేఒక వ్యక్తిని ఐదారుగురు యోధులు చుట్టుముట్టి హతమార్చటంమాత్రం అధర్మంగా కనబడింది విజయవర్మకు.

నిస్సహాయుడైనా ధైర్యంతో అంతమంది శత్రుసైనికులకు కత్తితో జవాబు చెబుతున్న వీరుడు, విజయవర్మ మాటలతో ఎక్కడలేని వుత్సాహం తెచ్చుకుని ఒకరి తరవాత ఒకరిని గాయపరచసాగాడు. అంతలో విజయవర్మ వెనకనుంచి ఆ సైనికులను ఎదుర్కొన్నాడు.






విజయవర్మ సమీపించేసరికే ఆ వీరుని కత్తిదెబ్బకు ఒక సైనికుడు కూలాడు. మరొకడు గాయపడి బాధతో విలవిల తన్నుకొంటున్నాడు. విజయవర్మ రావడంతో తక్కిన సైనికులు హడలెత్తి పలాయనమయ్యారు.

అలా పలాయనమైపోతున్న సైనికులలో ఒకరిని విజయవర్మా, వేరొకణ్ణి ఆ వీరుడూ కత్తికి బలిచేశారు. ఆతరువాత ఒకరిని మరొకరు అప్పుడే గుర్తించినట్టు ఎదురూ బొదురుగా నిలబడిపోయారు.

"సమయానికి సహాయపడ్డారు. మీరెవరు?" అని అడిగాడు ఆ వీరుడు విజయవర్మను. విజయవర్మ ఆ వీరుడి కంఠస్వరంలోని హుందానూ, గాంభీర్యాన్నీ చూసి నివ్వెరపోయాడు. ఆ నిమిషంలోనే, అతడు మామూలు సైనికుడు కాదనీ, తగినంత ప్రాముఖ్యం గలవాడే అయివుంటాడనీ గ్రహించాడు.

"నేను రావటం కొంచెం ఆలస్యమైంది. నాది సమయానికి అంతగా అక్కరకు రాని సహాయం అయినందుకు విచారిస్తున్నాను. నేను రాకపోయినా మీరు ఆ సైనికులందరినీ పరిమార్చివుండేవారు" అన్నాడు విజయవర్మ.



విజయవర్మ మాటలకు ఆ వీరుడు జవాబిచ్చేటంతలో, ఒక్కసారిగా పరుగెత్తి వస్తున్న గుర్రపుదళంచేసే ధ్వని వినబడింది. కాసేపటికల్లా నాలుగైదువందల మంది అశ్వసైనికులు అక్కడికివచ్చి ఆగారు. వాళ్ల దళ నాయకుడు ముందుగా అశ్వాన్ని దిగి, ఆ వీరుణ్ణి సమీపించి—

"ప్రభువుల అజ్ఞప్రకారం నా దళంతో వచ్చాను. చంద్రదుర్గాధిపతి వేయిమంది సైనికులతో ఈ సాయంకాలానికల్లా వస్తారు. తమ అజ్ఞ!" అన్నాడు.

"అదుగో ఆ చెట్లవెనకనే మన గుడారాలు ఉన్నాయి. ముందు చేయవలసిన



21

దేమిటో నిర్ణయిస్తాను. సైనికులందరూ గుర్రాలు దిగి ఇక్కడే ఉండేటట్టు ఆజ్ఞాపించి, నువ్వూ, ఈయనా కలిసి ఆ గుడారాలవద్దకు రండి!" అనిచెప్పి ఆ వీరుడు వెళ్ళిపోయాడు.

విజయవర్మకు యిదంతా ఆశ్చర్యం కలిగించింది. కాసేపటిలో అశ్వదళనాయకుడు, సైనికులకు వారి విధులు చెప్పి విజయవర్మ దగ్గరకు వచ్చాడు. ఎంతో కుతూహలంగా వున్న విజయవర్మ దళనాయకుణ్ణి ఆ వీరుడెవరని ప్రశ్నించాడు.

"ఎవరో తెలియదా? బీసల్వారు ప్రభువు!" అన్నాడు దళనాయకుడు.

విజయవర్మ ఆశ్చర్యానికి అంతు లేకపోయింది. తలవనితలంపుగా, తను సరాసరి బీసల్వారుప్రభువుకే సాయం వచ్చినందుకు తనను తాను అభినందించుకున్నాడు. భీమవర్మా, సోమశర్మల అంతం కనుక్కునేందుకు సమయం వచ్చిందికదా అన్న వుత్సాహంతో విజయవర్మ, దళనాయకుడితో కలిసి బీసల్వారు ప్రభువు విడిసిఉన్న గుడారాలకేసి బయలుదేరాడు.

బీసల్వారు ప్రభువు, విజయవర్మను గౌరవపూర్వకంగా తన గుడారంలోకి ఆహ్వానించాడు. అతిథి మర్యాదలను జరిపి, తరవాత సంభాషణ ప్రారంభించాడు:

"నేనెవరో యీసరికి మీకు తెలిసే వుంటుంది. ఇక మీ సంగతి నాకుతెలియ చెప్పండి!" అని అడిగాడు.

'నా పేరు విజయవర్మ' అని తప్ప అంతకన్న తను చెప్పకోగలిగింది ఏమీ వున్నట్టు కనబడలేదు. ఐనా, ఏముంది? తనింతవరకూ ఏ గొప్ప యుద్ధంలోనూ పాల్గొన్నదిలేదు. పెద్ద సాహసకృత్యాలా నెరపిఉండలేదు.

[వచ్చే సంచికలో ముగింపు]



# బలే సమాధానం!

డి. పాండురంగ విఠల్



చిటపట చినుకులు
తటపట కురియగ
చెరువుగట్టుపై
చెలికాండ్రిరువురు
చిందులు ద్రొక్కుచు
పోతూవున్నారు.

'ఉప్పు' ను వాడిటు
'పప్పు'నుచూచి
'ముప్పేదైనా
ముంచుకవస్తే,
నిప్పే చెరువుకు
అంటుకపోతే,
నీళ్ళే భగభగ
మండుకపోతే
చేపలు యేమైపోతాయో!
జాలివేస్తున్న'దన్నాడు.

'వచ్చేదింకను
వేసవికాలం
అగ్నిభయాలు
అసలే యెక్కువ,
అద్భుదమంటే
నీళ్ళే దొరకవు,
చేపలు యేమైపోతాయో!'
అంటూ 'వుప్పు'తో కలసి
'పప్పు' యేడ్చాడు.

స్నేహితు లిరువురు
ఏడ్చుచునుండగ
సాయంకాలం దాటింది;
అచ్చటి కొచ్చిన
'అధిక తెల్విగా'
"డెందుకు ఏడుపు?" అన్నాడు.

చిట్టచివ్వరికి
చెలికాండ్రిరువురు
సంగతి అంతా
సాంతం చెప్పి
గుండెలు బాదుకు యేడ్చారు.

'అధికతెల్విగా'
"డింలేనా?" యని
పకపక నవ్వి చెప్పాడు:
'చేపల మూకలు
చెల్లైక్కుతవిలె,
కప్పలన్నియూ
గల్లైక్కుతవిలె;
కంగా రెందుకు?' అన్నాడు.

'అల్లా అయితే
ఫర్వా లే'దని
ఉప్పూ పప్పులు
ఉత్సాహంతో
ఇంటికి త్రోవను పట్టారు:

# ఒంటిమిట్ట పుట్టుక



ఒకప్పుడు 'కడపమండలంలో' ఇద్దరు దోపిడిదొంగలు చాలా పేరుపొందారు. వాళ్లే ఒంటడూ, మిట్టడున్నూ. వాళ్ళు ధారులు కాసి, బాటసారులను కొట్టి బోలెడంత ధనం గడించారు. ఇలా గడించిన ధనమంతా ఒక కొండమీద పాతిపెట్టుతూ ఉండేవాళ్లు. ఆ కొండమీద ఒకేఒక బ్రహ్మాండమైన పలక వంటి పెద్దరాయి వుండేది. ఒంటడూ మిట్టడూ అక్కడ ఆస్తరణ ఏర్పరచుకొని, వాళ్ళ సంపాదన అంతా ఆ సమీపంలో దాచబెడుతూవచ్చారు. ఇలా వాళ్లు దాచ బెట్టిన సంపాదన లెక్కపెట్టవలసివస్తే, లక్షలలో విలువచేస్తుందని తేలింది.

ఒకరోజున, మామూలుప్రకారం ఒక బాటసారి అదారిని ఇలానే పోవటం తటస్థించింది. అలవాటుచొప్పున ఒంటడూ మిట్టడూ వానికి ఎదురుగా పోయి దుడ్డు కర్రలు పైకియెత్తి, 'ఏమిటయ్యా అలా చూస్తావూ? లొడ్డూ లొసుగూ బయట పెట్టూ!' అని గద్దించారు.

అమాయకపు చూపులతో, నిశ్చింతగా నిలబడివున్న ఆ బాటసారి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. చెక్కుచెదరలేదు. కొంచెం సేపుండి, వాళ్ళను ప్రశ్నింపనారంభించాడు :

"అబ్బాయిలూ!—మీరు కష్టపడి ఈవిధంగా ధనం సంపాయించటం నాకు చాలా సంతోషంగా వుంది. ధనం లేనివాడు ఎందుకూ పనికిరాడని మన పెద్దలే చెప్పారు. కనుక, మానవజన్మ ఎత్తినందుకు సంపాదించి తీరవలసిందే. కాని, నాది ఒక్కటే చిన్న సంశయం : ఈ ధనమంతా పట్టుకపోయి మీరు ఎవరిని సంతోషపెడుతున్నారో నాకు తెలియదు. దీనినంతటినీ పంచుకొని, అనుభవించి ఆనందించే ఆ పెద్దలు; మీరు

జి. శ్రీనివాసులు

చేస్తున్న ఈ పాపంకూడా పంచుకొంటారా? ఆ సంగతి తెలుసుకుని మీరెన్ని తలలు పగలగొట్టినా మహాబాగే" అన్నాడు.

ఒంటడూ మిట్టడూ ఆలోచనలో పడ్డారు.

అప్పుడు ఆ బాటసారి—వాల్మీకిమహర్షి జన్మకథను వాళ్ళకు విప్పిచెప్పి, తత్వం బోధించేసరికి వాళ్ళిద్దరూ చాపకట్టుగా ఆయన పాదాలకు సాష్టాంగపడ్డారు. వాళ్లకు తెలియకుండానే, వాళ్ళచేతులలో దుడ్డు కర్రలు జారి కిందపడినై.

ఆ బాటసారి వాళ్ళను లేవదీసి, ఊరడించాడు. అప్పుడు వాళ్లు "మహానుభావా!— మేము పరమ దుర్మార్గులం. ఇప్పటికి, అమాయకులైన బాటసారులను ఎందరను ఎన్ని విధాల హింసలు పెట్టామో మాకే గుర్తులేదు. ఎందుకో తెలియకుండానే, లక్షలకొద్దీ ఆస్తి సంపాదించాము. అదుగో, మహాత్మా! — ఆ కొండమీది పలకదగ్గర దాచిపెట్టాము. నిన్ను మేమేమీ అనలేము. నిన్నేకాదు, ఇంక ఎవళ్ళనూ ఏమీ అనము. ఈ ధనమంతా నీదే. నీ యిష్టంవచ్చినట్టు చేసుకో. మేము నీ దాసులం. నువ్వేమి చెబితే అలా చేస్తాం. తరుణోపాయం చూపించు" అంటూ చేతులు కట్టుకు నిలబడ్డారు.

అప్పుడా బాటసారి వాళ్ళు సంపాదించిన ధనమంతా పశపరుచుకొన్నాడు. ఆ కొండ మీదనే ఒక గొప్ప దేవాలయం నిర్మించాడు. దివ్యమైన కోనేరు తవ్వించాడు. ఆలయంలో శ్రీకోదండరామస్వామిని ప్రతిష్ఠింపించాడు.

ఆ దొంగలపేరు శాశ్వతంగా నిలిచిపోయేటట్టుగా ఆ గ్రామానికి 'ఒంటిమిట్ట' అని పేరుపెట్టాడు. దొంగల పేరిట వెలసిన ఆ గ్రామం, ఈనాడు కడపజిల్లాలో ఒక దివ్యక్షేత్రమై, రామభక్తులకు నిలయమై వున్నది. ఈ 'ఒంటిమిట్ట'లోనే బమ్మెర పోతనామాత్యుడు శ్రీమదాంధ్రభాగవతం రచించినట్టు చెప్పుకొంటారు.



# మానవజన్మ



ఉత్తమమైనదని చెప్పబడే మానవజన్మ ఎత్తటానికి ముందుగా మనం ఎన్నో స్వరూపాలు పొందివున్నాము. సృష్టికి ఆదిలో పుట్టినవి మత్స్యాలూ, కప్పలూ మొదలైన జలచరాలు. వెన్నెముక కలిగిన జంతుజాలంలో చేపలనే మొదట పేర్కొనవచ్చు. వాటివెనుక గ్రుడ్లు పెట్టేవీ, నీటిలోనూ, భూమి మీదాకూడా సంచరించగల ప్రాణులూ పుట్టాయి. ఇక్కడ సృష్టి ఆగి, రెండు పాయలయింది—ఒకప్రక్క సరీసృపాలూ, గాలిలో ఎగిరే ఖేచరాలూ, మరొక ప్రక్క పాలిచ్చే ప్రాణికోటీ అవతరించినై. పాలిచ్చే జంతువులనుండి క్రమంగా పుట్టుకవచ్చిందే మానవజన్మ. ఈ పరిణామాన్ని తెలుపుతున్న దీ పటం.

# కొప్పయ్య గొప్ప



సింగారపల్లెలో సూరన్నతాతకు చిత్రమైన అలవాటు ఒకటి వుండేది.

మాటకుముందు దేనికైనాసరే 'పందెం !' అంటూవుండేవాడు. బజారువెంబడి పోతూ వుంటే ఎవరైనా ఎదురుపడి "ఏం సూరన్న తాతా ! మబ్బులుపట్టినై. వాన కురుస్తుందల్లె వుందే !" అంటే, వెంటనే సూరన్న— "పందెం. వాన కురవదూ !" అని కచ్చితంగా చెప్పేసేవాడు.

ప్రతిదానికీ ఇలా 'పందెం ! పందెం !!' అనే సూరన్నకు ఈ దూకుడుమాట ఒకొకప్పుడు ప్రమాదంగాకూడా పరిణమించేది.

ఒకసారి ఒకపల్లెలో శుభాశుభ కార్యాలకు మంత్రాలు చెప్పే పెదశాస్త్రులుగారికి జబ్బుచేసింది. వచ్చిపోయే వైద్యులు నానా హడావిడీ చేస్తున్నారు. బంధువులూ, స్నేహితులూ పోగయ్యారు. శాస్త్రులుగారి ఇల్లంతా కోలాహలంగా వుంది.

ఆ సమయానికి మన 'సూరన్నతాత' ఆ దారివెంట వెళ్లటం సంభవించింది. శాస్త్రులుగారి యింటిముందు ఈ రద్ది అంతా చూశాడు. 'ఏమిటీ సందడీ ?' అని అక్కడ ఒకరిని అడిగాడు.

"శాస్త్రులుగారికి చెప్పలేనంత జబ్బు చేసింది. ఘనవైద్యులంతా వచ్చారు. ఇక ఫరవాలేదు, బ్రతికి బైటపడతాడులే" అన్నాడు ఆ మనిషి.

వెంటనే సూరన్న 'పందెం !' అన్నాడు. "శాస్త్రుల్లు బ్రతకడు. కావాలంటే పది రూపాయిలు పందెం. సై—" అంటూ రొండిన చేయిపెట్టి రూపాయిలు లాగి ఖంగుమనిపించాడు.

సూరన్న తత్వం తెలిసినవాడే కనుక, ఆ ఆసామీ అంతగా కోపం తెచ్చుకోలేదు. మెల్లిగా మంచిమాటలతో సూరన్నను మందలించి వెళ్ళిపోయాడు. తన ప్రజ్ఞకు




గర్వించి, 'హుఁ–' అనుకుంటూ సూరన్న అక్కడినుంచి బయలుదేరి మరి నాలు గడుగులు వేసేసరికి మరో పెద్దమనిషి ఎదురయ్యాడు.

"ఏం సూరన్నతాతా! మన శాస్త్రులు గారికి ప్రాణంమీదికి వచ్చిందట. బ్రతక డనుకొంటున్నారే. నీకేమన్నా తెలుసా!" అని అడిగాడు సూరన్నను.

"పందెం!" అన్నాడు సూరన్న, తడుము కోకుండా. "శాస్త్రులుగారు నిస్సందేహంగా బ్రతుకుతాడు. కావాలంటే పదిరూపాయిల పందెం. సైఁ" అంటూ రొండిన చేయిపెట్టి రూపాయిలు బయటికి లాగాడు. ఆ పెద్ద మనిషి సూరన్నని ఎరిగినవాడే కనక అతడూ కిక్కురుమనకుండా వెళ్లిపోయాడు.

ఆ రోజుల్లో సూరన్నతాత ధోరణి యిలా సాగిపోతూవచ్చింది.

ప్రతిదానికీ ఇలా అతి చొరవతో పందెం కట్టే సూరన్నతాతకు ఒకసారి ఒక కాలాం తకుడు తారసపడ్డాడు. ఈ సమయంలో సూరన్నతాతకు ఒకగొప్ప ఆలోచన తట్టింది. అదేమిటీ అంటే :

పాటేళ్లపందేలూ, కోళ్లపందేలలాగానే కప్పలపందెంమాత్రం ఎందుకు పెట్టకూడ దూ? అని. అనుకున్నాడో లేదో, వెంటనే వూరిబయటికి పరిగెత్తి చెరువులోనించి ఒక పెద్ద గోదురుకప్పని పట్టుకువచ్చాడు సూరన్నతాత.

సరే, కప్పని అలా ఇంటికి తెచ్చి ఒక కొయ్యపెట్టెలో పెట్టి, దానికి నిపుణతతో గెంతడం నేర్పాడు. గజం ఎడంగా నేలమీద రెండు గీతలు కొట్టి, ఒక గీతమీద కప్పని కూర్చోపెట్టి—

"గెంతరా తమ్ముడూ, గెంతూ!" అంటూ వీపుమీద వేలితో పొడిచేవాడు. ఈ విధంగా ఆ గోదురుకప్పను ఒక్క గెంతుతో నాలుగైదు గజాలు దూకేవరకూ తయారుచేశాడు. అక్కడినుంచి ఆ కప్పను

కొయ్యపెట్టెలో పెట్టి వూరూరా తిరుగుతూ "బిరుదువేసుకొన్న కోనసీమ కప్ప! గెంతటంలో దీనిని ఓడించగలిగిన కప్ప ఎవరి దగ్గరైనా వుంటే రండయ్యా, రాండి! పది రూపాయిలపందెం!" అంటూ కేకలుపెట్టుకొంటూ పోయేవాడు. ఈ కేక విన్నవాళ్లంతా, 'కప్పలపందెం ఏమిట్రా, ఎక్కడా చూడలేదు' అనుకొంటూ పకపక నవ్వుకునేవారు.

అంతలోనే శివరాత్రికి ఒక గ్రామంలో తిరణాల పచ్చింది. 'అక్కడ కోడిపందేలూ, పొట్టేళ్లపందేలూ జరుగుతయికదా! మనతో కప్పపందేలకు మొగ్గేవాడు వుండకపోతాడా' అని తలిచి సూరన్న అక్కడికి వెళ్ళాడు.

సూరన్న ఆ తిరణాలజనంలో అటుయిటు తిరుగుతూ బిరుదు పహించిన తన కోనసీమ కప్ప గొప్పతనాన్ని ఎదురైనవాళ్ళందరికీ చెప్పసాగాడు. చివరికి మన సూరన్న అదృష్టమో దురదృష్టమోగాని పందేనికి తయారైనవాడు ఒకడు ఎదురయ్యాడు. సరే, 'పందెం అంటే పందెం— పదిరూపాయిలు' అనుకున్నారు.

అయితే, ఆ పందేనికి పచ్చినవాడిదగ్గిర కప్ప లేకపాయె! అందుకని ఉత్సాహపంతుడైన సూరన్న, తనే పోయి ఆ చుట్టుపట్ల కప్పని వెతికి తెచ్చేటందుకు ఒప్పుకున్నాడు.




బిరుదు పహించిన తన కోనసీమకప్పని ఆ కొత్తవాడికి పప్పచెప్పి, సూరన్న, ఆ పందెగానికోసం కప్పని పట్టుకుపచ్చేటందుకు బయలుదేరాడు.

చచ్చీ చెడీ సూరన్న ఒక కప్పని పట్టుకు పచ్చాడు. గిరి గీసి రెండు కప్పలనూ నిలబెట్టారు. ముందుపందెం వేసినవాడు తన కప్ప వీపుమీధ తట్టేసరికి అది ఒక గజం దూరం గెంతింది. 'ఒస్ ఇంతేనా? నా కప్ప చూడు, అలాగ్గా నాలుగుగజాలు ఇట్టె దూకేస్తుంది!" అంటూ సూరన్న తన కప్ప వీపుమీద వేలుతో పొడుస్తూ— 'గెంతరా తమ్ముడూ గెంతు!' అన్నాడు మామూలుగా.

బిరుదు వహించిన కోనసీమ కప్ప గెంతుదామని వళ్లంతా కుదుపుకొన్నది. కాని నేలకు అతుక్కుపోయినట్టుగా అక్కడే పడిపోయింది. సూరన్నకు అశ్చర్యమూ కోపమూకూడా ఒక్కసారిగా ఉబికినై.

"కోనసీమ కీర్తి నిలపపురా తమ్ముడూ! సూరన్నతాత పేరు పోవలసిందేనా!" అంటూ మళ్లీ వేలితో తన కప్ప వీపుమీద పొడిచాడు. కప్ప గెంతేటందుకు మళ్ళీ వళ్ళంతా ఒక్కసారి విదిలించింది. కాని, కదలలేక ఉన్నచోటనే వుండిపోయింది.

జనమంతా సూరన్నను గేలిచేశారు. పందెం ఒడ్డిన పదిరూపాయిలూ పుచ్చుకుని ఆ కొత్తవాడు జనంలో కలిసిపోయాడు. పదిమందిలో అగౌరవం జరిగిందన్న ఉక్రోషంతో ఉడికిపోతూవున్న సూరన్నతాత, తన కప్ప వెనకకాళ్లు రెండూ పట్టుకుని తలకిందులుగా ఎత్తాడు—

"ఇన్నాళ్లుగా పెంచిన నాకూ, నువు పుట్టిన దేశానికీకూడా అమర్యాద తెచ్చావు గదరా తమ్ముడూ!" అంటూ పళ్లు పటపట కొరికాడు. కాని, అదే సమయంలో కప్పనోటి నుండి కుంకుడుగింజ లంతేసి గుండ్రని గులకరాళ్లు ఒక్కటొక్కటే కింద పడసాగినై.

తనకు జరిగిన మోసాన్ని గ్రహించాడు సూరన్న. తను పందెగాడికోసం కప్పను వెతికి తెచ్చేటందుకు వెళ్ళగా చూసి ఆ కొత్తవాడు—ఈ బిరుదు వహించిన కోనసీమ కప్పకు ఒకటొకటే గులకరాళ్ళు నోటిద్వారా లోపలికి ఎక్కించాడు. ఆ రాళ్ల బరువుతో తన కప్ప ఎగరలేకపోయింది. ఇంకేముంది! తను పందెం ఓడిపోయాడు.

ఇన్నాళ్లనుండీ సూరయ్యతాత ఆర్జించిన కీర్తి ఈనాటితో మాసిపోయింది. సూరయ్యతాత పెంచిన కప్పకు బిరుదూ పోయింది. అసలు మొత్తం సింగారపల్లి పేరేపోయింది.






అది ఒక చిన్నద్వీపం. ఆ ద్వీపంలో నివసించేవాళ్ళు మరుగుజ్జులు. వాళ్ళు భూమికి నాలుగు జానెలుమాత్రమే వుంటారు. ఐతే, మంచి తెలివిమంతులు; వాళ్లకు జంతుభాషా, పక్షిభాషా కూడా తెలుసు. మంత్రాలంటే వాళ్ళకి మంచి నమ్మకం.

ఆ ద్వీపవాసులు చిరకాలంగా కడుపులో చల్ల కదలకుండా కాలక్షేపం చేస్తూవచ్చారు. కాని, కొంతకాలానికల్లా ఒక అవాంతరం వచ్చిపడింది. మామూలు మానవులు ఒకప్పుడు ఈ ద్వీపం చూదామని వచ్చారు. వీళ్లను చూచి ఆ మరుగుజ్జువాళ్ళు భయపడ్డారు.

భయపడిన ఆ మరుగుజ్జులు 'మనకు కష్టకాలం వచ్చింది. నరుడికంటబడని చోటు చూచుకుని వెంటనే పోదాం' అని నిశ్చయించుకొన్నారు.

వాళ్ళందరూ సామానులన్నీ సర్దేసుకుని, సాగిపోదామనుకొంటూవుండగా బెన్నయ్య సంగతి వాళ్లకు జ్ఞాపకంవచ్చింది. అందరూ బయల్దేరారు కాని, బెన్నయ్యమట్టుకు కదలనని భీష్మించాడు.

"నాయనా, బెన్నా! — ఒంటివాడవై పోతావు. వాళ్లుచూస్తే బలీయులు. వాళ్ళ మధ్యని నీవు బతకలేవుసుమా!" అని బంధువులూ స్నేహితులూ చెప్పిచూచారు. వాడికి రోజూ అన్నం అమర్చిపెట్టే అవ్వ కూడా చెప్పిచూచింది. ఊహూఁ బెన్నయ్య వినలేదు. కాని, బెన్నయ్య మట్టుకు "ఏమైనా కానీండి. నా తోటా దొడ్డీ వదులుకొని నేను ఎక్కడకూ రాను. నా నోరు మంచిదైతే ఎవళ్లు మాత్రం నన్నేంచేస్తారు?" అని పట్టుపట్టి కూర్చున్నాడు.

చేసేది లేక, అందరూ ఊరు వదలి వెళ్లిపోసాగారు. అలా వెళ్లిపోతున్న బంధు

దీపావళి కథ



మిత్రులందరూ ఒక్కొక్కళ్ళే బెన్నయ్యతో వెళ్లివస్తానని చెప్పడం, బదులుగా బెన్నయ్య 'సరే, మంచిది' అనడం—ఇదంతా ఒక పూట పైగా పట్టింది.

ఒక్కడూ, మిగలకుండా ఆ ద్వీపవాసులు అంతా వెళ్లిపోయారు. అంతా వెళ్లిపోతే, బెన్నయ్యకి ఏమీ తోచిందికాదు. ఎదో పెద్ద వెలితిగా కనబడింది. ఏమీ తోచక, బెన్నయ్య తోటకు పోయి, పనిచేయసాగాడు. మధ్యాహ్నం అయ్యేసరికి ఇంటికి వచ్చాడు.

రోజూలాగానే తను వచ్చేటప్పటికి భోజనం సిద్ధంగా వుంటుందనుకున్నాడు బెన్నయ్య. తీరాచూస్తే, భోజనం లేదు. వట్టి బొచ్చెలే పడవేసివున్నాయి. ఆలోచన పాలుపోయిందికాదు. పడకగదిలోకి వెళ్ళాడు. పక్క అంతా చిందరవందరగా వుంది.

ఇది పనికాదని బెన్నయ్య వంట చేసుకుందామనుకున్నాడు. బియ్యం కడిగి పొయిమీద పెట్టాడు. తయారయేటప్పటికి చాలాసేపవుతుంది కనుక, ఇప్పుడే వచ్చెయొచ్చుకదా అని మళ్ళీ ఒకసారి తోటకు వెళ్ళాడు. వాడు తిరిగి వచ్చేలోపల అన్నం అడుగంటి, మాడి బొగ్గులయి వూరుకుంది.

ఆకలికి తాళలేకపోయాడు బెన్నయ్య. ప్రాణం విసుగెత్తింది. కసిన్ని పచ్చి మంచినీళ్ళు తాగి పడుకున్నాడు. "ఇలా కాదు. రేపు పొద్దుటినుంచి ఏంచేస్తానో చూసుకో!" అనుకున్నాడు తనలో తను.

అనుకున్నాడే కాని వంట సాగలేదు. మరునాటినించీ, కాయా కసురూ తిని కాలక్షేపం చేయసాగాడు. ఒకవేళ వంట తలపెట్టినా, కుండలూ మూకుళ్ళూ బద్దలయ్యేవిగాని, సవ్యంగా పని జరిగేదికాదు. చివరకు బెన్నయ్య విసిగి వేసారిపోయాడు.

బెన్నయ్య ఆకటిపాట్లతో వుంటే, అవతల తోటపని సాగేదికాదు. బెన్నయ్యకు బెదురుపుట్టి గుండెనిబ్బరం సడలింది. ఒకరోజున వాడు విచారంగా కూర్చున్నాడు.

అలా కూర్చొనివుండగా, ఎదట గుబురుగా పెరిగిన ఒక పొదలో రెండు చుక్కలు మెరిసినాయి. ఇదేమిటా అని తేరి చూడగా ఆ మెరిసే చుక్కలు ఉడతమ్మ కన్నులని తెలుసుకొన్నాడు.

ఉడతమ్మ గభీమని ఇవతలకు వచ్చింది: "ఏమయ్యా, బెన్నయ్యా!— ఎందుకీ విచారం?" అని అడిగింది. "ఏం, చెప్పను ఉడతమ్మా? మావాళ్లు ఎదట ఉన్నన్నాళ్లూ వాళ్ల విలువ తెలిసిందికాదు. ఇప్పుడు ఒక్కడినీ ఇక్కడ వుండి నానాపాట్లూ పడుతున్నాను" అన్నాడు.

"బెన్నయ్యాబాబూ!—ఎన్నాళ్ళు ఇట్లా వుండటం, చక్కటి పిల్లను ఓదాన్ని చూసి కట్టుకోక ఎందుకీతిప్పలు?" అంది ఉడతమ్మ.

ఉడతమ్మ ఇలా అనగానే, బెన్నయ్యకు లోగడ వాళ్ళవాళ్ళు చెప్పినమాట జ్ఞాపకానికి వచ్చింది. "ఒరే బెన్నా!—నువ్వు ఒక యింటివాడవైతే మాకు చూడాలని వుందిరా" అన్నప్పుడల్లా బెన్నయ్య "చచ్చినా పెళ్ళాడను. పెళ్ళాడితే పెద్ద యాతన!" అని చెప్పేవాడు.

బెన్నయ్య ఈ విధమైన పూర్వగాథ తలపోసుకొంటూ వుండగా, ఉడతమ్మ కొడుకు ఉరకలేసుకుంటూ అక్కడికి వచ్చాడు. "అమ్మా, అమ్మా!—చెట్టుకింద ఎవరో ఒక అమ్మాయి పడిపోయింది. రా, రా" అని పిలిచాడు.





ముగ్గురూ బయల్దేరి అక్కడికి వెళ్లారు. అక్కడ పువ్వుల మొక్కల లోపల ఒక చిన్నారి బాలిక పడివున్నది. ఆ బాలిక ముఖం మల్లెపువ్వులాగా తెల్లగా వున్నది. దాని పాలబుగ్గలు గులాబీరంగుతో మెరిసిపో తున్నాయి. ఎలా చూచినా ఆ పిల్ల అందాలు చిందులూ వుంది.

"పాపం, ఈ అమ్మాయి ఎందుచేతనో పడిపోయింది. దీనిని ఇక్కడ వదిలేసిపోతే ఎలా?" అంది ఉడతమ్మ.

ఉడతమ్మ కొడుకు ఆ పిల్లను లేవదీద్దా మని ఎత్తుకోబోయాడు. వాడివల్ల కాలేదు. అప్పుడు బెన్నయ్య్య, ఆ అందాలపిల్లని ఎత్తు కున్నాడు. అంతా కలిసి బెన్నయ్య్య ఇంటికి వచ్చారు. ఆ అమ్మాయిని చాపమీద కూర్చో బెట్టారు. ఉడతమ్మ విచారంతో తల వూచి "ఈ పిల్లకు ప్రాణం వున్నట్టు లేదు" అన్నది సంశయిస్తూ, మెల్లగా. శ్వాస ఆడుతుందో లేదో అని బెన్నయ్య్య పిల్లముక్కుకింద వేలెట్టాడు. ఉడతమ్మ చెప్పింది చివరకు: "బెన్నయ్య్యబాబూ!—ఇది నిజమైన మనిషి పిల్ల కాదుసుమా. మనిషిబొమ్మను ఎవళ్ళో మరిచిపోయి వదిలేసి పోయారు" అని.

బెన్నయ్య్య ఆ బొమ్మలోని అందం అంతా పరిశీలించాడు. సిగ్గుపడుతూనే దాని బుగ్గలు నిమిరాడు. పట్టుకుచ్చులాగా నిగ నిగలాడే దాని తలను తడిమాడు. 'ఈ అమ్మాయి పేరేమిటో!—' అని ప్రశ్న వేశాడు. "అన్నట్టు, ఇది బొమ్మకదూ!" అని అను కొని నాలుక కరచుకున్నాడు.

దీనంగా చూస్తూ "ఉడతమ్మా! ఉడ తమ్మా!—మంత్రంవేసి, ఈ బొమ్మను మనిషిగా మార్చే మొనగాళ్ళు ఎవరేనా వున్నారా? నిజంగా ఈ బొమ్మే బాలిక అయితే, ముచ్చటగా 'రాణీ' అని పిలుద్దును కదా!" అన్నాడు.

"బాగానే వుంది, బెన్నయ్య్యబాబూ నువ్వు చెప్పినమాట!—" అని సంతోషించింది

ఉడతమ్మ. "అయితే, వుండు చెబుతాను" అంటూ, అట్టె కొంచెంసేపు ఆలోచించింది. "నాతో రా" అన్నది వెంటనే.

వాళ్ళు కలిసి వెళుతూవుండగా, చీకటి పడింది. ఆ చీకట్లో భయంకరమైన పెద్ద తల ఒకటి వాళ్లకు ఎదురువచ్చింది: "ఏయ్, ఆగండి!—ఇప్పుడు గొప్పతుపాను రాబోతున్నది. అదిగో, నా పాదాలకు చల్లటి గాలి తగులుతున్నది. తప్పక వస్తుంది గాలివాన. పొండి, పొండి వెనక్కు" అన్నది.

అందుకు బెన్నయ్య: "అయ్యో!—పువ్వుల పొదలో మాకొక చక్కదనాల పిల్లబొమ్మ దొరికింది. ఆ బొమ్మకి ప్రాణంపోసేవాళ్ళు ఎవళ్ళైనా ఉన్నారేమో కాస్తచెబుతూ—నీకు పుణ్యం వుంటుంది" అని అనేకవిధాల ప్రాధేయపడ్డాడు.

అందుకు ఆ భయంకరమైన పెద్దతల; "ఓహో అదా సంగతి! మీరు తిన్నగా, ఇక్కడి నుండి నాలుగుఆమడల దూరంలో వుండే గూబయ్యగారిదగ్గిరికి వెళ్లండి. ఆయన మీ కోరిక నెరవేరుస్తాడు" అని చెప్పింది.

ఉడతమ్మా, కొడుకూ, బొమ్మను యెత్తుకొన్న బెన్నయ్యా బయల్దేరి చెట్టుతొర్రలో వుండే గూబయ్యదగ్గిరికి వెళ్ళారు. ఆయనతో బెన్నయ్య బొమ్మసంగతి అంతా చెప్పి, దానికి కాస్తంత ప్రాణంపొయ్యమని కోరాడు.






అంతా విని గూబయ్య : "ఓరి, మీ గోల కూలా! ఈ బొమ్మకా ప్రాణం పొయ్యమంటున్నారు ?—ఇక్కడికి పది ఆమడల దూరంలో, కీకారణ్యాల్లో ఒక పెనుభూతం ఉన్నది. ఆ పెనుభూతం ఒక పిల్లను పెంచుకొంటున్నది. ఆ పిల్ల ఆడుకునే బొమ్మ సుమా, ఈ బొమ్మ! పెనుభూతానికి తెలిస్తే నిన్ను బతకనిస్తుందా! కనుక దీనిని ఎక్కడ తీశావో, అక్కడ పెట్టేసిరా" అన్నాడు.

"ఎవరిదేనా కాని, బొమ్మను నేను విడిచేదిలేదు. దీనికి ప్రాణంపోసే ఉపాయం చెప్పవయ్యా, గూబయ్యా!" అంటూ మళ్ళీ ప్రాథేయపడుతూ బతిమలాడాడుబెన్నయ్య.

"అయితే, బొమ్మలకు ప్రాణంపోసే మంత్రం ఒక్క ఆ పెనుభూతానికే తెలుసు" అని చెప్పాడు గూబయ్య.

"మరైతే, జీవంపొయ్యటానికి యేం పుచ్చుకుంటుంది గూబయ్యా, ఆ పెనుభూతం ?" అని మళ్ళీ అడిగాడు బెన్నయ్య ఆత్రంతో.

"దాని కెందుకు ధనం ?—బతిమాలినా సరే, అది బహుమతులు కూడా పుచ్చుకోదు. బుద్ధిపుడితే ఉపకారం చేస్తుంది. దానివల్ల ఉపకారం పొందటానికి ప్రాప్తంవుండాలి, అంతే" అంటూ పెనుభూతం ఉండే అరణ్యానికి సరాసరి మార్గంచెప్పాడు గూబయ్య.

"సరే" అని చెప్పి సెలవు పుచ్చుకుని, బెన్నయ్య పోబోతూవుండగా, గూబయ్య వాణ్ణి వెనక్కు పిలిచి, చెవిలో ఇలాచెప్పాడు: "నాయనా!— నీకొక రహస్యం చెబుతా. గుర్తుంచుకో : పెనుభూతానికి తను పెంచే పిల్లంటే పంచప్రాణాలున్నూ. పిల్ల సంతోషమే తల్లి సంతోషం. పిల్ల విచారమే తల్లి విచారం. కనుక ఆశ్చర్యంగొలిపే పనిచేసి, నువ్వు ఆ పిల్లని సంతోషపెట్టగలిగితివంటే, ఆ పెనుభూతం నిన్ను మెచ్చుకుని, నీ కోరిక తీరుస్తుంది," అని చెప్పాడు.



ఈ మాటలకు బెన్నయ్య్యా నిరుత్సాహ పడ్డాడు. ఉడుతా, ఉడుతమ్మ కొడుకూ కూడా బెన్నయ్య్యా విచారం తొలగించలేక పోయారు. ముగ్గురూ కలిసి ఇల్లు చేరుకొన్నారు. పెనుభూతానికి ఆశ్చర్యం కొలిపే దారితెలియక బెన్నయ్య్యా విచారసాగరంలో మునిగిపోయాడు.

ఇలా వుండగా—ఆ ద్వీపానికి వచ్చిన మామూలు మనుష్యులు తిరిగి తిరిగి వింతలన్నీ చూచారు. సంతోషించారు. ఆ ద్వీపంలో ఎవళ్ళూ లేకపోవడం చూడగా వాళ్ళకు మరీ వింత తోచింది.

చివరకు ఒక చెట్టుకింద, చింతతో కూర్చొనివున్న బెన్నయ్య్యా కనిపించాడు. వాడి వింతరూపం చూచి వాళ్ళు ఆశ్చర్యపోయారు. మాటల సందర్భంలో బెన్నయ్య్యకు పట్టుకొన్న విచారకారణం తెలుసుకున్నారు. తెలుసుకొని, 'ఒస్, ఈపాటిదానికేనా బెంగ!' అంటూ ధైర్యం చెప్పి, వాడిని సముద్రపు ఒడ్డుకి తీసుకుపోయి ఓడలో వున్న వింతవింతల వస్తుసామగ్రులన్నీ చూపించారు.

అందులో బెన్నయ్య్యను అతిగా ఆకర్షించిన సామగ్రిని వాడు ఆత్రంతో కావాలని కోరగా వాళ్లు వాడికి ఇచ్చారు. తక్షణమే బెన్నయ్య్యా ఉడుతమ్మనూ, ఉడుతమ్మ కొడుకునూ వెంటబెట్టుకుని, బొమ్మను చంకనెత్తుకుని ఈసారి తిన్నగా పెనుభూతం వుండే అరణ్యానికి ఉత్సాహంతో బయల్దేరాడు. కష్టాలుపడి, ముగ్గురూ ఆ కీకారణ్యం చేరుకొన్నారు. పెనుభూతం ఉండే భవనం సమీపించారు.

రెండుతలల కుక్కలు రెండు, వాళ్ళమీదికి ఎగసివచ్చినాయి. బెన్నయ్య్యా ఒక టపాకాయ తీసి పేల్చాడు. ఇటువంటి ధ్వని ఎన్నడూ విని ఎరుగని ఆ కుక్కలు రెండూ మరి కనపడకుండా మటుమాయమైనాయి. ఈశబ్దం విని పెనుభూతమూ, కూతురూ



37

లోపలినుండి ఇవతలకు చక్కావచ్చారు. బెన్నయ్యా చేతిలో బొమ్మను చూచి వాళ్లిద్దరూ మండిపడ్డారు. లాక్కోబోయారు. మతాబీ వెలిగించాడు బెన్నయ్యా. ఆ కళ్లతో వాళ్ళు చూడలేకపోయారు. అంతలో చిచ్చుబుడ్డి ముట్టించాడు. అది ఆకాశాన్ని అంటడం చూచి వాళ్లు ఆశ్చర్యపోయారు.

బెన్నయ్యాను చేరబిలిచి, బొమ్మనిమ్మని బతిమాలుతూ, 'నీకేంకావాలో కోరుకో!' అన్నది భూతం. తను వచ్చిన పని చెప్పాడు బెన్నయ్యా. ఆ బొమ్మ తన కూతురుకు ప్రియమైనది కావటంచేత క్షణంసేపు భూతం ఆలోచనలో పడింది.

పెనుభూతం కూతురు మరుగుజ్జు కావటంచేత ఇంతవరకూ తగిన వరుడు ఎవడూ దొరకలేదు. ఇప్పుడు బెన్నయ్యా కంటపడటంతోనే, తన కూతురుకు ఈడూ జోడూ కుదిరిందని ఆ పెనుభూతం మనస్సులో ఉప్పొంగిపోయింది.

బెన్నయ్యాకి తన పిల్లనిచ్చి వైభవంగా పెళ్లిచేసింది. ఆ బొమ్మకు ప్రాణంపోసి, అల్లుడికి అరణంగా ఇచ్చింది. అందరూ కలిసి బెన్నయ్యా ఉండే చోటుకు వెళ్ళారు.

ఆ ద్వీపాన్ని చూడవచ్చిన మనుష్యులు, పోతూపోతూ బెన్నయ్యానూ పొట్టిపిల్లనూ దీవించి కానుకలిచ్చారు.

ఆనాడు భయపడి పారిపోయిన మరుగుజ్జు లంతా క్రమంగా మళ్ళీ వచ్చి ద్వీపం చేరుకొన్నారు. బెన్నయ్యా ఒక యింటివాడై నందుకు వాళ్లందరూ సంతోషించారు. వాడు వెలిగించినటువంటి రకరకాల బాణాసంచాలు చూచి అమితాశ్చర్యం పొందారు.

'నాకొకటి! నాకొకటి!!' అంటూ వాళ్లంతా హడావుడి చేయసాగారు.

"ఏమిటిరా 'నాకొకటి, నాకొకటీ?' పండగపూటా ఇవన్నీ ఎందుకనుకొన్నారు. తీసుకోండి. వెలిగించుకోండి!" అంటూ బెన్నయ్యా అందరకూ పంచిపెట్టాడు.





# పెడ బుద్ధి

బ్రహ్మదత్తుడు కాశీనగరాన్ని పరిపాలించే కాలంలో ఒకప్పుడు, ఒక గ్రామంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను 'వేదభం' అనే మహా మంత్రంలో సిద్ధి పొందాడు. గ్రహాలన్నీ కూటమయ్యే సమయమందు, ఆకాశంవంక చూస్తూ ఈ మంత్రాన్ని పునశ్చరణ చేసినట్టయితే, సరాసరి ఆకాశంనుండి బంగారు, వెండి, ముత్యం, పగడం, రత్నం, కెంపు, నీలం- ఈ ఏడు వస్తువులూ వర్షిస్తాయి.

మంత్రసిద్ధిగల ఈ బ్రాహ్మణ్ణి ఆశ్రయించి బోధిసత్వుడు, ఆయనకు ప్రియశిష్యుడయ్యాడు. ఒకరోజున శిష్యుణ్ణి వెంటబెట్టుకొని గురువు అరణ్యప్రాంతానికి చేరుకొన్నాడు.

ఆ అరణ్యంలో ఐదువందలమంది గజదొంగ లున్నారు. వాళ్లు గురు, శిష్యులిద్దరినీ అటకాయించారు. ఐతే, ఆ దొంగలలో చిత్రమైన నియమం ఒకటి వున్నది. ఇద్దరు బాటసారులు కలిసి ఆత్రోవన వచ్చినట్టయితే ఇంటికి పోయి శిఖారుసుము తెచ్చి తోడివానిని విడిపించుకోవటానికి అవకాశమిచ్చి, అందులో ఒకనిని వదిలేస్తారు.

ఆ వచ్చిన బాటసారులు తండ్రీ కొడుకులైతే తండ్రిని పోయిరమ్మని చెప్పి, రుసుము తెచ్చి కొడుకును విడిపించుకునేటందుకు అవకాశమిస్తారు. అలానే, తల్లీ కూతురూ ఐతే తల్లినీ, సోదరులైతే అందులో ఒకనినీ, గురు శిష్యులైతే శిష్యుణ్ణీ—ఇలా వదిలిపెట్టడం మామూలు.

ఇప్పుడా వింతదొంగలు బ్రాహ్మణ్ణి తమ వద్ద అట్టేపెట్టుకుని, శిష్యుడైన బోధిసత్వుణ్ణి పోయిరమ్మని పంపించారు. వెళ్ళేటప్పుడు బోధిసత్వుడు గురువుకు నమస్కరించాడు. "గురువర్యా!—భయపడకండి. ఒకటి రెండు రోజులలో తప్పక తిరిగివచ్చేస్తాను.




ఐతే, నా మనవిమట్టుకు ఒక్కటి వినండి: ఇవాళ గ్రహాలన్నీ కూటమయ్యే రోజు. కొంపతీసి ఇవాళమాత్రం మంత్రం జపించి రత్నాలవర్షం రప్పించకండి. అలా చేశారంటే మీకూ, ఈ దొంగలకూ కూడా తీరనిముప్పు కలిగితీరుతుంది"—ఇలా అని మరి మరి చెబుతూ, బోధిసత్వుడు బయలుదేరి వెళ్ళాడు.

సూర్యాస్తమయం ఐంది. దొంగలు వచ్చి బ్రాహ్మణ్ణి పట్టుకొన్నారు. పుచ్చపువ్వులాటి వెన్నెలకిరణాలను వెదచల్లుతూ పున్నమి చంద్రుడు ఆకాశాన తిరుగుతున్నాడు. బ్రాహ్మడు పైకిచూచి, గ్రహాలు కూటమయ్యే సమయం వస్తుందని పడికట్టాడు. "దొంగల బారిని పడి, చేతకానివాడిలాగా ఈ హింసలన్నీ ఎందుకు నే సనుభవించాలి? చేతిలో వున్న మంత్రాన్ని పఠించి, వర్షం రప్పించి, దొంగల రుసుము వాళ్ళకిచ్చేసి, విడుదలవుతాను. స్వేచ్ఛ పొంది సుఖంగా వుంటాను" అనుకొన్నాడు.

అనుకొని, బ్రాహ్మడు ఆ దొంగలగుంపును చేరబిలచాడు: "అబ్బాయిలూ!—మీరు నన్నెందుకు బంధించారు చెప్పండి!" అన్నాడు. "అయ్యా, ఇంకెందుకు? డబ్బు కోసం!" అన్నారు వాళ్ళు.

"అంతేకదా!—అలాఐతే నేను చెప్పినట్టు చేయండి, మీరు కోరినధనం ఇస్తాను" అన్నాడు. "ముందు నన్ను విప్పెయ్యండి. నాకు శుభ్రంగా స్నానం చేయించండి. నూతనవస్త్రాలు కట్టబెట్టండి. పుష్పజాతులన్నీ తెచ్చి యిక్కడ పోగుపోయండి. నాచుట్టూ పరిమళద్రవ్యాలూ, ధూపదీపాదులకు కావలసిన సామగ్రులూ అమర్చిపెట్టండి. అటుపైన ఏం జరుగుతుందో చూడండి!" అని చెప్పాడు.

అక్షరాలా ఆ బ్రాహ్మడు చెప్పిన ప్రకారమే చేశారు దొంగలు. తరువాత ఆయన అదనుచూచి, ఆకాశంవంక దృష్టినిలిపి,

'వేదభ' మంత్రం ఉచ్చరించాడు. వెంటనే విలువగల లోహాలూ మణులూ వర్షించినై! దొంగలు గబగబ వాటన్నిటినీ ఏరి మూటలు కట్టుకొని వాళ్లదారిని వాళ్ళు పోయారు. వాళ్ళ వెనుకనే బ్రాహ్మడూ వెళుతున్నాడు.

అంతట, మధ్యదారిలో మరిఒక దొంగల గుంపు తారసపడి, మొదటి గుంపును ఎదుర్కొన్నది. "ఎందుకని అబ్బాయిలూ, మీరు మమ్మల్ని పట్టుకుంటారు?" అని అడిగారు మొదటి దొంగలు. అందుకు రెండవ గుంపు "ఇంకెందుకు, డబ్బుకోసం!" అన్నారు.

"అంతేకదా!—డబ్బుకోసమే ఐతే, ఈ బ్రాహ్మణ్ణి ఆశ్రయించండి. ఈయన ఆకాశం పైకి చూస్తే చాలు, విలువగల రత్నాలూ మణులూ వర్షిస్తాయి. అలా చేసే మాకు ఈ ధనమంతా ఇచ్చాడు" అని చెప్పి, వాళ్ళు తప్పించుకపోయారు.

ఇప్పుడు రెండవ దొంగలజట్టు బ్రాహ్మణ్ణి వదలక పట్టుకుంది. "మాకుకూడా ధనమియ్యవయ్యా బ్రాహ్మడా!" అని వాళ్ళు బొబ్బలుపెట్టి పీడింపసాగారు. అందుకు బ్రాహ్మడు "అబ్బాయిలూ!—ఇందాకా ఆ దొంగలకు నేనిచ్చింది మంత్రమహిమవల్ల రప్పించిన ధనం. నేను నేర్చిన మంత్రానికి మళ్ళీ ఒకయేడాదికిగాని శక్తికలగదు. ఇది



నాయిష్టంవచ్చినప్పుడల్లా జపించితే పనిచేసే మంత్రం కాదు. దీనికంతా గ్రహకూటం కలియడం అదీ, చాలా గొడవ వున్నది. కనుక, ఒక్క ఏడాది అయేసరికి, గ్రహాలు కూటమవుతై. అప్పుడు నా మంత్రం పారుతుంది. ఆ వెంటనే జపించి, మీకు కనకవర్షం కురిపిస్తాను" అన్నాడు.

బ్రాహ్మడి మాటలు నమ్మలేదు దొంగలు. 'మాకంటే ముందు వచ్చినవాళ్ళను ఇట్టే కుబేరులను చేసిపంపావే. మేం అడిగితే ఏడాదివరకూ కనిపెట్టుకు ఉండమంటావా, అబద్ధాలకోరా!' అంటూ, పదునైన కత్తి పుచ్చుకుని వానిని నిలువునా రెండు



41




చెక్కలుగా చీల్చివేశారు! పైగా అతని కళేబరాన్ని దారిమధ్యలో వేలాడదీశారు!!

ఇలా చేసి, గబగబ పరుగులెత్తిపోయి మొదటి దొంగలజట్టును కలసి, అందరినీ చంపి, వాళ్ళదగ్గిర వుండే ధన ద్రవ్యాలను అపహరించారు. అపహరించిన ధనం వాటాలు తెగలేదు. ఈ రెండవ జట్టు దొంగలలో వాళ్ళలో వాళ్ళకే రెండు కక్షలు ఏర్పడినై. ధనంకోసం రెండుకక్షలవాళ్ళూ పోరాడుకున్నారు.

పోరాటంలో మొత్తం ఒక వెయ్యిమంది నరుక్కుచావగా, చివరకు ఇద్దరే యిద్దరు మిగిలారు. ఇలా మిగిలిన దొంగలిద్దరూ ధనాన్నంతటినీ సమీపంలోని ఒక అరణ్యంలో దాచిపెట్టారు. అందులో ఒకడు విచ్చు కత్తులతో ఆ ధనానికి కాపలాకాస్తూవుండగా రెండవవాడు తినుబండారాలు తేవటానికని ఊళ్ళోకి వెళ్లాడు.

ధనాగారంవద్ద కూర్చున్న దొంగ "నా నేస్తం వస్తే, అయాచితంగా ఈ ధనంలో సగభాగం కబళించుకపోతాడే. ఎలా?" అనే ఆలోచనతో కుమిలిపోసాగాడు.

అక్కడ—తినుబండారాలు తీసుకరావటానికి వెళ్ళిన ఆ దొంగ—"వాడు చస్తే ఈ ధనమంతా నాకే ఉండిపోతుందిగా! కుబేరుడి నయిపోవచ్చుకదా!" అని అనుకున్నాడు. అనుకొని, తనవంతు పదార్థాలు కేటాయించుకుని, తక్కినభాగంలో విషం కలిపివేశాడు.

వీడు పదార్థాలు చేతపట్టుకొని తనబస చేరుకొనేసరికల్లా అ రెండవదొంగ వీడిని కసుక్కున పీక తెగవేసి, కళేబరం దూరంగా విసరివేశాడు! విషంకలిసిన బియ్యం వండుకు తిని, చివరకు వాడూ ప్రాణాలు విడిచాడు!!

ఈవిధంగా బ్రాహ్మడూ, బ్రాహ్మడితో పాటు దొంగలూ అంతా, కలిసి మొత్తంగా చచ్చి వూరుకున్నారు.

ఒకటి రెండు రోజులలో బోధిసత్వుడు దొంగల కీయవలసిన రుసుము చేతపట్టుకు వచ్చాడు. గురువుకోసం చూచాడు. గురువు కానరాలేదు. ఎక్కడ చూచినా ధన మే! ఎక్కడ చూచినా కళేబరాలే!! అప్పుడే అను కున్నాడు బోధిసత్వుడు—"ఈ బ్రాహ్మడు నామాట చెవినిపెట్టలేదు. తనకు తోచినంతా చేశాడు. మొన్నటిరోజున ఈ బ్రాహ్మడు మంత్రం జపించి, రత్నాలవర్షం రప్పించే వుంటాడు. దాని ఫలితంగానే అందరూ చచ్చివుంటారు" అని తలిచి, బాటవెంబడే చూచుకొంటూ పోసాగాడు.



కొంతదూరంలో గురువుగారి కళేబరం కనిపించింది. "హయ్యో!—గురువర్యా, నామాట విన్నావుకాదుకద! ఎంతటి గతికి పాల్పడ్డావు!!" అంటూ అతను వాపోయాడు. చితుకులు పోగుచేసి తెచ్చి గురువుకు దహ నాదిక్రియలు సలిపాడు. అడవిపువ్వులు పట్టుకవచ్చి ఆ స్థలమందు వుంచి, భక్తి పూర్వకంగా తుదిసారి నమస్కరించాడు.

అక్కడినించి ఇంకా అలా అలా వెళ్లగా మొదటి దొంగలజట్టులోని ఐందువందల మంది శవాలూ కంటపడినై. మరి కొంత దూరంలో రెండవజట్టులో వుండే దొంగల కళేబరాలు పడివున్నయి.

రెండుతప్ప, బోధిసత్వుడికి తను చూచి వున్న అందరి కళేబరాలూ లెక్కకు సరీగా కనిపించినై. ఐతే ఆ ఇద్దరూ యెక్కడికి తప్పించుకుపోయారా అని ఆలోచించాడు. వాళ్ళు ధనం దోచుకుపోయిన జాడ కని పెట్టి, ఆదారినే వెళ్ళగా ఆ దారి బోధి సత్వుణ్ణి ఒక కీకారణ్యంలోకి తీసుక పోయింది. ఆ అరణ్యంలో ధనంమూటలు కనిపించినై. తప్పిపోయారనుకొన్న ఇద్దరు దొంగలలోనూ ఒకడి కళేబరం కనిపించింది.

ఐతే వాడిపక్కని తినుబండారాలు గల పాత్ర వున్నది. 'ఓహో, ఇదా సంగతి!' అని అనుకొన్నాడు బోధిసత్వుడు. ఇంకా

నాలుగడుగులు వేసేసరికి ఒకమూలని ఆ మిగిలివున్న దొంగయొక్క కళేబరం వేలాడ దీయబడి వున్నది. ఇంకిప్పుడు—ఎవరూ చెప్పనక్కరలేకుండానే, జరిగిన సంగతి అంతా బోధిసత్త్వుడికి మొదటినుండి చివరి వరకూ అవగాహనైపోయింది.

ఇదంతాచూచి బోధిసత్త్వుడు చాలా విచారించాడు: "నా మాట పాటించాడుకాదు గురువుగారు. అంతగా చెప్పిపోయినా, పెడ చెవిని పెట్టాడు. ఆత్మబుద్ధి సుఖమను కున్నాడు. ఇందుకు ఫలితం?—తనూ నాశనమయ్యాడు, తనతోపాటు ఒక వెయిమంది జనమూ చావటానికి కారకుడయ్యాడు. ఇతరుల మాట వినక, తమకు తోచిందే మంచిదని అనుకొని పనులు చేసేవాళ్ళకు ఇటువంటి శాస్తి జరిగేతీరుతుంది.

"నా గురువుగారు తన మంత్రమహిమ వల్ల భూలోకానికి రప్పించిన ధనసంపద మానవకోటికి ఉపకృతి చేయలేదు సరి కదా, పైగా సంఘాతమరణానికీ, అంతులేని వినాశానికీ దారితీసింది. కనుక, బుద్ధి వక్రమార్గాన్ని పట్టినప్పుడు మంచివస్తువుల వల్ల కూడా కీడే కలుగుతుంది. ఆ దోషం వస్తువులో లేదు, బుద్ధిలో వుంది. వక్రబుద్ధి అగ్నిజ్వాలవంటిది. అది ఒకళ్ళ నాశనంతో పోదు. మరి ఎంతమందినో నాశనంచేస్తే గాని ఆ అగ్ని చల్లారదు'—ఈ బోధలను బోధిసత్త్వుడు అరణ్యమంతా మారుమోగే టట్టు ప్రబోధించాడు. తన గురువుగారిని ఉదాహరణగా చూపి, అందరకూ నచ్చే టట్టు చెప్పాడు. బోధిసత్త్వుని ప్రబోధానికి వనదేవతలు జేజేలు కొట్టారు.

అటుతరువాత ఆ ధనసంపద నంతటినీ బోధిసత్త్వుడు తన ఆశ్రమానికి తీసుకపోయి, అదంతా లోకోపకారంకోసం వినియోగించి, తరువాత అవతారం చాలించాడు.






ఢిల్లీరాజ్యానికి ప్రభువు అనంగపాలుడు. ఆయనకు కమలావతి, రూపసుందరి అని ఇద్దరు కుమార్తెలు. పెద్దామెను అజ్మీరు రాజుకూ, చిన్నామెను కనూజ్ రాజుకూ ఇచ్చి అతివైభవంగా వివాహంచేశాడు. పెండ్లయిన కొద్దికాలానికే ఇద్దరూ సంతానవతులయ్యారు. కమలావతికి పృథ్వీరాజు, రూపసుందరికి జయచంద్రుడు—ఇద్దరికీ మగబిడ్డలే పుట్టారు.

పృథ్వీరాజు అదృష్టవంతుడు. ఏమంటే: తండ్రి తదనంతరం దఖలుపడిన అజ్మీరు రాజ్యంతోపాటు, మగసంతతి లేని తాత అనంగపాలుడు, ఢిల్లీరాజ్యాన్నికూడా అతనికే చెందజేశాడు. ఈవిధంగా రెండు గొప్ప రాజ్యాలకు అధిపతి ఐన పృథ్వీరాజు ప్రతిభ సాటిలేనిదిగా ఉన్నదంటే ఆశ్చర్యం దేనికి? పృథ్వీరాజు ప్రతిభావంతుడు కావటం ఎంత సహజమో, అతని ప్రతిభకు జయచంద్రుడు ఈర్ష్య చెందటమూ అంత సహజమే. తలవని తలంపుగా ఢిల్లీరాజ్యం, తోడి మనుమడైన తనకు తప్పించి పృథ్వీరాజుకివ్వటం అసూయకు కారణం కాదా? ఈ కారణంచేత జయచంద్రుడు పృథ్వీరాజుపైన మత్సరం పూనాడు. తనకు లేకుంటే పోయె, పృథ్వీరాజుకి ఢిల్లీ లేకుండావుంటే జయచంద్రునికి తృప్తి అనిపించింది. ఈ వుద్దేశంతో అతను పృథ్వీరాజును కష్టాలపాలు చేయాలనీ, ఢిల్లీ రాజ్యం అతనికి లేకుండా చెడగొట్టాలనీ నిశ్చయించుకొన్నాడు. నిశ్చయించుకొని, అందుకు తగిన సన్నాహాలన్నీ సమకూర్చసాగాడు. ఈ సంగతి ఇలావుండగా—

జయచంద్రుడికి సంయుక్త అనే చక్కదనాల కూతురున్నది. సంయుక్త సౌంద

ఎమ్. ఎస్. శాస్త్రి




ర్యాన్నిగురించిన ఖ్యాతి దేశదేశాలలో అల్లుకుపోయింది. ఎందరెందరో రాజ పుత్రులు ఆమెను చేపట్టడానికి ఉవ్విళ్ళూరారు. అటువంటివారిలో పృథ్వీరాజు కూడా ఒకడు.

ఐతే, పృథ్వీరాజుకూ తక్కినవారికీ తేడా వున్నది: పృథ్వీరాజు సంయుక్తను వరించటమే కాదు, సంయుక్తకూడా మనసులో పృథ్వీరాజును వరించేఉన్నది.

సంయుక్తను గురించిన సంకల్పం ఎప్పుడైతే కలిగిందో ఆ వెంటనే, అతను తనను పెంచి పెద్దచేసిన దాదివద్దకు వెళ్ళాడు. ఆమె పాదాలకు వినయంగా నమస్కరించాడు. తన వాంఛను వెల్లడించి, రూప పటం చేతికిచ్చాడు.

ఇంతకంటె దాదికిమాత్రం కావలసిందేమిటి? సంతోషంతో ఆమె బయలుదేరింది. కనూజ్ చేరుకొన్నది. చతురత చూపి అంతఃపురంలో అడుగుపెట్టింది. అదును చూచి పృథ్వీరాజు తనకిచ్చిన రూపపటాన్ని సంయుక్తకు అందించింది.

ఆ రూపపటం పుచ్చుకొని సంయుక్త కన్నులకు అద్దుకొన్నది. "అమ్మా!—నీ మేలు మరువలేను. 'ఏనాటికైనా సంయుక్త పృథ్వీరాజుకే రాణి' అని చెప్పు!" అన్నది.

దాది ఇంటికి వెళ్ళి ఈ వార్త చెప్పటంతో పృథ్వీరాజు పరవశుడయ్యాడు. సంయుక్త సమ్మతి తెల్పటంవరకు బాగానే వుంది. మరి జయచంద్రుడు ఇందుకు వప్పుకొంటాడా? ఎంతమాత్రం వప్పుకోడని పృథ్వీరాజుకు మొదటనే తెలుసు.

అనుకొన్నట్టుగానే, జయచంద్రుడు తన కుమార్తె వివాహానికి స్వయంవరం చాటింపించాడు. అందరకూ పిలుపులు వచ్చినై కాని, పృథ్వీరాజుకుమట్టుకు రాలేదు.

పైగా, ఇంకొక పనిచేశాడు జయచంద్రుడు—తన కోటగుమ్మానికి కాపలా కాస్తున్నటుగా, పృథ్వీరాజుయొక్క

విగ్రహం తయారుచేయించి, సింహద్వారం వద్ద నిలబెట్టాడు. స్వయంవరానికి వచ్చే రాజపుత్రులందరూ ఈ విగ్రహం చూడటంతో పృథ్వీరాజుకు తీరని అవమానం కలుగుతుందనీ, ఈవిధంగా తన అక్కసు తీరుతుందికదా అనీ ఆశించాడు.

ఐతే జయచంద్రుని ఆశ ఫలించలేదు. జయమాలను చేతపట్టుకొనివచ్చిన సంయుక్త దర్బారులో ఆసీనులైవున్న రాజపుత్రులందరివంకా ఒక్కసారి చూచింది. అప్పుడు అందరూ తమతమ అందచందాలనుచూచుకొని మురిసిపోసాగారు. దర్బారు చుట్టూతా తిరిగింది. తిన్నగా పోయి సింహద్వారంవద్ద ఉన్న పృథ్వీరాజు ప్రతిమకు జయమాలను వేసింది!

వేయడమేమిటి!–మెరపు మెరసి వెలిసినట్టుగా పృథ్వీరాజు రానేవచ్చాడు. ఒక్క తృటిలో సంయుక్తను గుర్రంమీద ఎక్కించుకొని ఉడాయించాడు!! ఇకేముంది—? సంయుక్త ఢిల్లీకోటకు చేరిపోయింది! సంయుక్త ఇప్పుడు 'రాణీ సంయుక్త'గా మారిపోయింది!!

'అబ్బా, ఎంత పని జరిగింది!' అని విస్మయంపొందాడు జయచంద్రుడు. ఉగ్రుడయ్యాడు. కాని చేసేదేముంది? లేకేమి!–




మనసులోని కార్పణ్యం ఇప్పుడు మరింత పెచ్చరిల్లింది. కసితీర్చుకొనే అదనుకోసం కాచుకొని కూర్చున్నాడు.

ఆనాడు జయచంద్రుని ఆశ ఫలించక పోయినా, ఇప్పుడు గప్పుమని ఒక తరుణం కలసివచ్చింది. మహమ్మదుగోరీ మనదేశం మీదికి ముమ్మరంగా ఎత్తివచ్చాడు. ఇళ్ళు తగులబెట్టాడు, ఊళ్ళు కొల్లగొట్టాడు, గుళ్ళూ గోపురాలూ నేల కూల్చాడు. కనబడిన హిందువునల్లా కత్తికి బలిచేశాడు.

ఈ విధంగా భారతావని సర్వనాశనం కావటాన్ని పృథ్వీరాజు భరించలేక పోయాడు. తన చేతికింది సామంతుల నంద



రిని సమావేశపరిచాడు. స్థితిగతులు వెల్ల డించాడు. దేశగౌరవం కాపాడటంలో శాయ శక్తులా తోడుపడండని వేడుకొన్నాడు.

అందరూ అతని మాటను శిరసావహిం చారు. ఒక్క జయచంద్రుడే పాటించ లేదు. సామంతులందరూ సాయపడటంతో పృథ్వీరాజుకు గొప్పబలం చేకూరింది. ఆ దెబ్బతో శత్రువును తిరిగి చూడకుండా తరిమికొట్టాడు!

యుద్ధంలో ఓడిపోయిన గోరీ దెబ్బతిన్న పాములాగా కక్ష తీర్చుకోవటానికని సిద్ధం చేసుకోసాగాడు. గోరీ సిద్ధపడటం సహజ సిద్ధమే. ఐతే, గోరీ ఓటమి తన ఓటమిగానే భావించాడు జయచంద్రుడు. గోరీకంటె ఎన్నో మడుగులు ఎక్కువగా విచారించాడు. ఇప్పుడు పృథ్వీరాజును చిత్తుచేయటం ఎలాగా అని ఆతనికంటె ఇతనే ఎక్కువ ఆత్రం చూపాడు.

ఈ ఆత్రంతో జయచంద్రుడు సమయం కనిపెట్టి సామంతులను చీలదీశాడు. పృథ్వీరాజంటే రోత పుట్టేటట్టు వారికి నూరి పోశాడు. ఇలా చేయగలిగిన తన సమర్థతకు జయచంద్రుడు విజయగర్వం పొందాడు. ఐనా తృప్తిలేకపోయింది.

'జన్మశత్రువైన పృథ్వీరాజును తల యెత్తుకోకుండా లొంగదీయాలి. ఇది ఎలా సాధ్యమవుతుంది?'—ఇదే ఎంతసేపూ అతని యోచన. ఈ ఆలోచనలో మునిగి డేరాలో కూర్చునివుండగా, జయచంద్రుణ్ణి వెతకి కొంటూ ఒక సైనికుడు వచ్చాడు.

జయచంద్రుడు ఏకాంతంగా వుండే సమయంలో, ఆ సైనికుని వేషంలో వున్న సంయుక్త తండ్రి పాదాలపైన పడింది. "నాయనా!—ఇప్పటికే దేశం సర్వనాశన మయింది. కుట్రలు నిలుపు చెయ్యి. కార్పణ్యం మాను. కారుణ్యం వహించు. కులగౌరవం నిలబెట్టు. దూరంయోచించు!" అంటూ అనేకవిధాల బతిమాలుకొన్నది.

ఊహుం. పరమ మూర్ఖుడైన జయచంద్రునికి ఇదేమీ చెవికెక్కలేదు. "కుటుంబద్రోహి!—నువ్వే దీనికంతకూ మూలం, ఛీ—పో—నా యెదట లే!" అని కసరికొట్టి అటనుండి గిరుక్కున లేచి వెళ్లిపోయాడు.

చివికి శిథిలమైన హృదయంతో ఇల్లు చేరుకొన్నది సంయుక్త.

పౌరుషశాలి ఐన పృథ్వీరాజు పోరు మానలేదు. ఇప్పుడు సామంతులందరూ అతనికి ప్రతికక్షులయ్యారు. అతనిదా ఒంటిపాటు. అందుచేత సహధర్మచారిణి సంయుక్తకూడా ఈసారి రణరంగానికి ఉరికి తన విధి నెరవేర్చుకోవలసి వచ్చింది.

ఏమైతేనేం, దశ మరలిన పృథ్వీరాజుకు పతనం తప్పలేదు. చివరిపరకు శక్తిచూపి, అతడు శాశ్వతంగా పడిపోయాడు! రాజు పడిపోవటంతో రాచస్త్రీలకు రక్షణ కొరవడింది. రక్షణ లేకపోయినా వారికి శిక్షణ తక్కువకాలేదు.

సంయుక్త వెంటనే సహగమనానికి సిద్ధంచేసుకొన్నది. తోడి మహిళలనందరినీ తయారుచేసింది. ఈవిధంగా వారు గుక్కెడు ప్రాణానికి అశించక, రాజస్థాన ఖ్యాతిని నిలిపి త్యాగధనులయ్యారు. రాజస్థాన చరిత్రలో సంయుక్త పృథ్వీరాజుల పేర్లు స్వర్ణాక్షరాలతో లిఖితమైనాయి.

తన కల ఫలించటమే దీక్షగా పెట్టుకొన్న మూర్ఖుడు జయచంద్రుడు. వానికి తగిన శాస్తి జరిగే తీరింది. కాలసర్పంవంటి మహమ్మదు గోరీ తన పని తీరగానే వానిని కన్ను పొడిచాడు. రాజ్యం లాగికొని పుచ్చె ఎగురగొట్టించడంకంటె కావలసిన శిక్ష మరి యేమిటి వుంటుంది? జయచంద్రుని వంటి కుట్రదారునకూ దేశద్రోహికీ ఇదొక శిక్ష కానేకాదనుకొన్నారు లోకులు.



# ప్రకృతిలో వెలుగులు

మన పండగలూ పబ్బాలూ, అన్నిటికీ వెలుగు ముఖ్యం. అందుకనే తప్పక దీపారాధన చేస్తాము. వెలుగు జీవితానికే ఆధారమైవుంది. ఈ మాటను రుజువు పరచటానికి ప్రకృతిలో అనేక చిత్రాలున్నవి.



అందరకూ తెలిసినవి మిణుగురుపురుగులు. అమావాస్యనాటి కటికచీకటిలో కూడా ఇవి చుక్కలలాగా మెరుస్తూవుండటం మనం ఎరుగుదుము. వీటిని కొన్ని పక్షులు పట్టుకపోయి వెలుగు కోసం వాటి గూళ్ళలో పొదుగుకుంటాయి.

ఇటువంటిదే కస్తూరిపురుగు. చాలా అందంగా చూడ ముచ్చటగా వుంటుంది. దీని ఒంటినుండి మిణుకుమిణుకుమని చక్కటి వెలుగు వస్తుంది. వీటినిగురించిన వింత యేమిటంటే—3, లేక 4 పురుగులను ఒక గాజుగొట్టంలో వేసినట్టయితే, అవి ఇచ్చే వెలుతురుకు, ఒక పుస్తకం పట్టుకు కూర్చుని చక్కా చదువుకోపచ్చు నన్నమాట! సరస్వతిజెర్రిని మీరు చూచే వుంటారు. ఇది పాకుతున్నంతమేరా మతాబీవెలుగువంటి వెలుగు ప్రకాశిస్తూనే వుంటుంది.

పోతే—సహజమైన వెలుగునిచ్చే కొన్ని జలచరాలుకూడా ఉన్నాయి. 'స్టోమియాస్‌బోవా' అనీ, 'సయేనియన్' అనీ రెండు రకాల వెలుగునిచ్చే చేపలున్నాయి. బొమ్మలో చూడండి. గుండ్రపాటి రంధ్రాలుగా కనబడే ఆ అన్నిటినుండి చక్కటి వెలుగు—లాంతరునుండివచ్చే వెలుతురులాగానే వెలువడి, సముద్రపు అడుగుభాగంలో ఎంతో ప్రదేశానికి వెలుగునిస్తాయి. 'జెల్లి' చేప లనేవాటికి, తలమీద వెలుగునిచ్చే దీపాలవంటివి ఉన్నై.








యశస్కరుడు కాశ్మీరదేశాన్ని పరిపాలించే కాలంలో—మాటల మాయవల్ల, కష్టపడి సంపాదించుకొన్న ధనాన్ని కాజేసినవాని కథను చదివి ఉన్నాంకదా!

మరొకప్పుడు—ఒక రోజున, న్యాయ శాఖకు సంబంధించిన ఉద్యోగులు వచ్చి "ప్రభూ!—ఒక బ్రాహ్మడు మన దివాణంలో ప్రాయోపవేశం చేస్తున్నాడు" అని చెప్పారు.

తక్షణమే రాజు ఆ బ్రాహ్మణ్ణి పిలిపించి, "మీ ఫిర్యాదు యేమిటండీ?" అని అడిగాడు. ఇందుకు ఆ బ్రాహ్మడు ఇలా సంజాయిషీ చెప్పుకొన్నాడు:

"కాశ్మీరదేశ ముఖ్యపట్టణమైన శ్రీనగరపు శ్రీమంతులలో నేనొకడను. ఐతే—కాలం మారింది. స్థితిగతులు మారినై. ఆస్తులు తరిగిపోయినై. అప్పులు చుట్టుకొన్నాయి. ఇల్లూ వాకిలీ, తోటా దొడ్డీ అన్నీ అమ్మేసి, బ్రతుకుతెరువుకోసం ఎక్కడికన్నా పోదామని నిశ్చయించుకొన్నాను.

"ఆ వూరిలోనే ఒక వర్తకుడు నా ఆస్తి సంతతినీ కొనుక్కొన్నాడు. ఐతే—తోటలో వుండే ఒక దిగుడుబావిమాత్రం అమ్మివేయకుండా నా భార్యకోసమని అట్టెపెట్టాను. ఎండాకాలంలో తోటమాలీలు ఈ బావిలో నీళ్ళు తోడిపోసుకొని పూలమొక్కలు తడుపుకొంటారు. ఇలా వాళ్ళు బావినీళ్ళు వాడుకున్నందుకు, ఏటా శిస్తురూపకంగా కొంత ప్రతిఫలం చెల్లిస్తూ వుంటారు. ఇలా వచ్చే ఆదాయంతో నా భార్యకు సుఖంగా భుక్తి గడచిపోతుందనే వుద్దేశంతోనే బావిని కేటాయించి అట్టెపెట్టింది. నా భార్య భుక్తి విషయంలో ఇటువంటి ఏర్పాటు చేశాను కదా అనే తృప్తితో, వెనక దిగులు ఏమీ పెట్టుకోకుండా దేశాంతరం వెళ్ళిపోయాను.

ఇ. భాస్కరమ్మ



"ఇరవైయ్యేళ్ల తరువాత, కొంత సంపాదనతో, మళ్ళీ దేశానికి తిరిగివచ్చాను. తిరిగివచ్చి చూసేసరికి నా భార్య యెవరింటిలోనో చాకిరి చేసుకొని పొట్టపోసుకొంటున్నట్టు తెలియవచ్చింది.

"ఈ మాట తెలియగానే నాకు కోపమూ వచ్చింది, దుఃఖమూ పొరలివచ్చింది. వెంటనే నా భార్యను పిలిపించి, "నీ భుక్తికి తగిన యేర్పాటు నేను చేసేవెళ్లాను కదా! ఇప్పు డీగతి పట్టటం ఎందుచేత?" అని అడిగాను.

"అందుకామె 'మీరు దేశాంతరం వెళ్ళాక నేను ఆ దిగుడుబావిదగ్గరకు వెళ్ళాను. వెళ్ళేసరికి, మన ఇల్లు కొన్న వర్తకుడు నన్ను నానామాటలూ అని, చావగొట్టి, బయటకు సాగనంపాడు. ఆడదాన్ని. ఏంచెయ్యగలను...?' అంటూ తన గోడు వెలపోసుకొన్నది.

"వెంటనే న్యాయాధిపతులవద్దకు వెళ్లి, ప్రాయోపవేశం చేసి, 'దుష్టుడైన ఆ వర్తకుడు నా నూతిని అన్యాయంగా వశపరుచుకొన్నాడు' అని ఫిర్యాదుచేశాను. అంతా విని, ఉద్యోగులు వర్తకునిదే న్యాయమని తీర్పుచెప్పారు. అందుచేత, నా నూతిమీద నాకున్న అధికారం నేను వదులుకోవలసి వచ్చింది.

"ఇలా ఎంతమంది పెద్దమనుష్యుల వద్దకు వెళ్ళి చెప్పుకొన్నా, అందరూకూడా వర్తకుడిపక్షాన్నే తీర్పు చెబుతూవచ్చారు" అంటూ, జరిగిన సంగతిఅంతా చెప్పాడు.

చెప్పి "మహారాజా! నేను కేవలమూ అమాయకుణ్ణి. ఈ దావాలూ ఫిర్యాదులూ ఏమీ తెలియనివాణ్ణి. అప్పుడూ యిప్పుడూ నాది ఒక్కటేమాట: ఇల్లూ దొడ్డీ మాత్రమే ఆ వర్తకునికి అమ్మాను కాని, పెరటో వుండే బావిమట్టుకు అమ్మనేలేదని ప్రమాణంచేసి చెబుతున్నాను. కనుక, ఈ విషయంలో ఏలిక న్యాయం అనుగ్రహించకపోయి

నట్టయితే, ఈ రాజద్వారంవద్ద ప్రాణాలు విడవడంతప్ప గత్యంతరంలేదు" అన్నాడు.

* * *

మరునాడు యశస్కరుడు విచారణకు కూర్చున్నాడు. వాది, ప్రతివాదీ, సాక్షులు, ఇదివరలో ఈ ఫిర్యాదు విచారణచేసి తీర్పు లిచ్చిన అధికారులు—అందరూ రాజాజ్ఞ ప్రకారం హాజరయ్యారు.

'విచారణ ఎలా జరిగింది ?' అని రాజు వేసిన ప్రశ్నకు, న్యాయాధిపతులు ఇలా చెప్పారు : ప్రభూ !—మేము ప్రతిసారీ న్యాయంగానే విచారణచేసి తీర్పుచెప్పాము. దుష్టబుద్ధి గల ఈ బ్రాహ్మడు మా తీర్పులను పాటించటంలేదు. అసలు క్రయ పత్రమే కల్పితమని చెప్పటానికికూడా సాహసిస్తున్నా డతను.'

అప్పుడు రాజు పత్రం తీసుకొని పరిశీలనగా చూచాడు. 'కూపసహితముగా ఇల్లూ, తోటా విక్రయించడమైనది...' అని అందులో స్పష్టంగా వ్రాసివున్నది.

ఆలోచించాడు రాజు. తరువాత సభలో ఉన్నవారితో అదీ ఇదీ మాటాడుతూ కూర్చున్నాడు. మాటల సందర్భంలో రత్నాల ప్రసక్తి వచ్చింది. రాజు, అక్కడ ఉన్నవారి ఉంగరాలు తీసుకొని, వాటిలోని




ఆభరణాలను కుతూహలంతో పరిశీలింప సాగాడు.

ఆతరువాత, సరదాగా మాటాడుతూనే, నవ్వుతూ నవ్వుతూ, ఇతరులవద్దనుంచి తీసుకున్నట్లే, ప్రతివాది ఐన వర్తకునిదగ్గర కూడా ఉంగరం అడిగి తీసుకొన్నాడు.

అలా, ఇవతలకి వచ్చేసిన యశస్కరుడు, ఆ ఉంగరాన్ని భటునిచేతి కిచ్చి "ఈ వుంగరం తీసుకొని నువు వర్తకుని ఇంటికి వెళ్ళు. వర్తకుని గుమాస్తాను కలుసుకో. ఈ ఉంగరం ఆనవాలు చూపించి, ఇదుగో ఫలానా సంవత్సరపు జమాకర్చుల చిత్తా కావాలని అడిగిపట్టుకురా" అని



53

చెప్పిపంపాడు. ఆ కాలంలో ఇలా నమ్మకం కలగటానికని ఆనవాలుగా ఇచ్చే వస్తువును 'అభిజ్ఞానము' అనేవాళ్ళు.

రాజుగారి నవుకరు వర్తకుని ఇంటికి వెళ్ళి, 'అభిజ్ఞానం' గుమాస్తాకు ఇచ్చి, చిత్తా పుస్తకం ఇమ్మని అడిగాడు. గుమాస్తా ఏ విధంగానూ సందేహపడటానికి అవకాశం లేకపోయింది. అతడా ఉంగరాన్ని దగ్గర ఉంచుకొని, కావలసిన చిత్తా ఇచ్చిపంపాడు.

చిఠా రాగానే, యశస్కరుడు జాగర్తగా చూచాడు. పద్దుల మధ్యని ఒకచోట—ఆ క్రయదస్తావేజు వ్రాసిన లేఖరికి వేయి రూపాయలిచ్చినట్టు కర్చు కనపడింది.

పత్రం వ్రాసిన లేఖరికి ఇంత సొమ్ము ఇవ్వటమనేది రాజుకు విడ్డూరంగా తోచింది. "వర్తకుడు ఇలా చేయటానికి కారణం ఏమైవుంటుందీ?" అని కొంచెం నిదానంతో యోచించాడు. కిటుకు బోధపడింది. తక్షణమే రాజు దర్బారులోని అందరికీ ఆ చిఠా చూపించాడు. పత్రం వ్రాసిన లేఖరిని పిలిపించి ప్రశ్నించాడు.

"మహాప్రభూ!—అపరాధం మన్నించాలి. నేను వర్తకునివద్దనుండి వేయి రూపాయిలు తీసుకున్నమాట వాస్తవం. తీసుకుని, "కృపారహితముగా" అన్న మాటను "కృపాసహితముగా" అని దిద్ది, మార్చి వ్రాసినమాటా నిజమే. ప్రభువులు దయామయులు. క్షమించాలి..." అంటూ, పాదాలమీద పడ్డాడు.

వర్తకుని మోసం రుజువయింది. లోగడ తిర్పులిచ్చిన న్యాయాధిపతులందరూ తెల్లబోయారు. పట్టుబడిన లేఖరిని రాజు క్షమించి వదిలాడు. వర్తకుడు కొన్న ఇల్లూ పెరడూ అంతా వాదిఐన బ్రాహ్మడికి ఇప్పించివేసి, అపరాధిఐన వర్తకుణ్ణి రాజ్యంలోనించి వెళ్ళగొట్టించాడు.



# రంగుల బొమ్మ కథ - 4

ఇప్పుడు గంగన్న మంచి గమ్మత్తుచేశాడు. ఆనవాలు ఏమీ తెలియకుండా వేషం పూర్తిగా మార్చివేసి, మళ్ళీ రాక్షసుని కోటకు చేరుకొన్నాడు. చేరుకున్నాడేకాని, అక్కడ వుండే అప్సరస కొత్తగా వచ్చిన ఈ కుర్రవానిని దరి చేరనీయలేదు. "అబ్బాయీ!—చూడగా, నమ్మరాని కాలంగా కనిపిస్తున్నది. మొన్నను నీవంటి కుర్రవాడికే, పోనీఅని కనికరించి జాగా యిస్తే, మా యజమానిని ఏమర్చి బంగారుకోడిని కాజేసిపోయాడు .." అని ఇంకా ఏమో అనేటంతలోనే మళ్ళీ రంకెలు వేసుకొంటూ రాక్షసరాజు ప్రవేశించాడు. జాలిగుండె గల అప్సరస ఈ కుర్రవానిని దయతలిచి రహస్యస్థలంలో దాచివేసింది.

'నరవాసన! నరవాసన!!—' అంటూ జ్వాలాముఖుడు హుంకరించాడు. భార్య మందలించి వానికి భోజనంపెట్టింది. భోజనం కాగానే "ఏవి, నా ధనపు సంచులు!" అన్నాడు. కొన్ని ఖాళీసంచులు తెచ్చి భార్య వాని ఎదట పెట్టింది. "కురిపించు!—కనకవర్షం కురిపించూ!!" అంటూ, ఆ సంచీలు తలకిందుగా పట్టుకొన్నాడు. జలజలమని రకరకాల వెండి, బంగారు నాణాలు లెక్కలేకుండా వర్షింపసాగినై.

అలా వర్షించిన ఆ ధనమంతా ఒక బ్రహ్మాండమైన పర్వతంలాగా పోగు పడింది. ఆ ధనరాసి ధగధగ మెరిసిపోతూ, చూస్తే కన్నులు జిగాలు మంటున్నయి! ఇటువంటి ఆకర్షణీయమైన సౌందర్యాన్ని చూచి ఆనందిస్తూనే జ్వాలాముఖుడు నిద్రపోయాడు.

ఇదంతా కనిపెట్టుతూవుండిన గంగన్న ఒడుపుచూచి, చడీ చప్పుడు చేయకుండా మహిమగల ఆ సంచులు చేతపట్టుకొని ఉడాయించాడు. ఇంటిదగ్గిర కనిపెట్టుకొనివున్న గంగన్నతల్లి, వాడు తెచ్చే ఈ ధనం చూచి ఎంతో ఆనందించింది. ఐతే, ఫలానా కోటనుండి ఇవన్నీ కాజేసి తెస్తున్నట్టు తెలియగానే, ఆమె కొడుకును మందలింపసాగింది: 'వాజమ్మా!—ఎన్నడూ ఆ కోటకు పోబోకుసుమా!—ప్రాణానికే అపాయం కలుగుతుంది' అని ఎన్నోవిధాల నూరిపోసింది.

ఐనా, గంగన్న దృష్టిఅంతా ఆ రాక్షసరాజుమీదనే ఉండె. వాడిని ఎలా జయించటమా అనేదే గంగన్నకు పట్టుకొన్న దీక్ష!




డి. ఎల్. వెంకటచలపతి - బెంగుళూరు

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 జనవరినెల సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ నవంబర్ 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ ఒకపోస్టుకార్డుపైనవ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## డిశంబరునెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో : పూలరంగడు | రెండవ ఫోటో : తోడుదొంగలు

పంపినవారు : ఆర్ .ఎస్. జాన్, పాల్స్ బిల్డింగ్ - విజయనగరం

బహుమతిపొందిన ఈ వ్యాఖ్యలు, పంపినవారి పేరుతోసహా డిశంబరునెలలో ప్రచురిస్తాము. బహుమతిమొత్తం రూ. 10/- డిశంబరునంచిక వెలువడినవెంటనే పంపబడుతుంది.

వస్తూంది!

విజయ వారి

# చంద్రహారం

డైరెక్టర్

కె. కామేశ్వరరావు, బి.ఎ.



నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI CHAKRAPANI.

Photo by A. L. Syed



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఓడను పంపు

పంపినవారు:
టి. దైవాధీనం - సర్వింగి

